శూద్రకమహాకవి విరచిత

# పద్మప్రాభృతకమ్

(సంస్కృత భాణము)



## తెలుగు వ్యాఖ్యానం

రవి

భారతభారతికి రత్నాలరాశులిచ్చి
తనకంటూ ఏమీ మిగుల్చుకోని

**కీ. శే. మానవల్లి రామకృష్ణకవి గారు**
**(1866 – 1957)**



ఎవని వాణి సేవ నెన్నతరము గాదు
అరిది కైత కెవడు బిరుదుజెట్టి
పాదములకు చిన్ని పద్మోపహారము
మానవల్లి కవికి మనసు మీర

# మున్నుడి

పద్మప్రాభృతకం అనే ఈ భాణాన్ని రచించినది మృచ్ఛకటికం అన్న ప్రఖ్యాత నాటకాన్ని రచించిన శూద్రకుడనే మహాకవి. ఈ భాణం – చతుర్భాణి అన్న నాలుగు భాణాలలో ఒకటి. భాణం అంటే ఏకాంకిక. చతుర్భాణిలో భాణాలు, ఆ రచయితల వరుస ఇది. పద్మప్రాభృతకం – శూద్రకుడు, ఉభయాభిసారిక – వరరుచి, పాదతాడితకం – శ్యామిలకుడు, ధూర్తవిటసంవాదం – ఈశ్వరదత్తుడు. ఈ చతుర్భాణిని 1922 లో మానవల్లి రామకృష్ణకవి, S.K. రామనాథశాస్త్రి గారలు చేరి పరిష్కరించి ప్రకటించారు. పద్మప్రాభృతకం – అంటే "పద్మం అనే బహుమానం" అని అర్థం. ఇంత అందమైన పేరు గల ఈ భాణం లోని కథావస్తువు కాస్త ఎబ్బెట్టుగా, వేశ్యల రంధితో, ధూర్తుల ప్రస్తావనలతో, ఎకసెక్కపు మాటలతో, పొద్దస్తమానం శృంగారక్రీడల తాలూకు విషయాలతో నిండి ఉంటుంది. కొండొకచో, ద్వంద్వార్థాలు కూడా కద్దు. ఒక్కమాటలో చెప్పాలంటే ఈ సంస్కృతభాణం – తెలుగు ప్రబంధకావ్యం వినుకొండ వల్లభరాయని క్రీడాభిరామం పోలికలతో ఉంటుంది.

క్రీడాభిరామంలో గోవిందమంచన శర్మ, టిట్టిభశెట్టి అనే ఇద్దరు మిత్రులు ఏకశిలా నగరంలో తిరుగుతూ చూస్తున్న దృశ్యాలను వర్ణిస్తూ కామమంజరి అన్న వేశ్యను చేరుకోవడం కథాంశమయితే, ఈ పద్మప్రాభృతకంలో శశుడనే విటుడు తన మిత్రుడు మూలదేవుడనే అతనికి దేవసేన అనే వేశ్యను కట్టబెట్టడం పనిగా ఉజ్జయిని నగర వీధుల్లో తిరుగుతూ, కనబడిన మనుషులను మాట్లాడిస్తూ, వారి స్వభావాన్ని బయటపెడుతూ, చివరికి దేవసేనను ఒప్పించి పని జరిపించడం కథ. ఒక విధంగా గిరీశాన్ని క్రీడాభిరామంలో నాయకుడుగా పెట్టి వ్రాసిన ఏకాంకికలా ఉంటుంది. క్రీడాభిరామం "వీథి" అనే నాటకప్రక్రియను పోలి ఉంటే, పద్మప్రాభృతకం భాణం అనే ఏకాంకిక. ఈ నాటకపు ప్రధాన ప్రయోజనం – సరిగ్గా క్రీడాభిరామానికి ఉన్న ప్రయోజనమే. క్రీడాభిరామంలో మైలసంత, ఏకవీర గుడి, మైలారభైరవుని భటవిన్యాసాలు, ముద్దరాలు ముసానమ్మవసతి, తురకమసీదు, అపైన కప్పురభోగి వంటకాలు, వీథుల్లో వేశ్యమాతల మోసాలు, మాచల్దేవి వృత్తాంతం ఇత్యాదులు, నాటి నగరజీవితాన్ని ఎలా ఉన్నదున్నట్టుగా ప్రతిబింబిస్తాయో, అలాగే ఈ పద్మప్రాభృతకం లోనూ, ఒకప్పటి ఉజ్జయిని నగరం, నాటి స్త్రీలు, వేశ్యల అలంకారాలు, రకరకాల పురుషులు, వారి ప్రవర్తనా, నాటి క్రీడలూ, వినోదాలు, పూలవీథి, వేశ్యావాటిక, నగరకూడలి, కూడలి మధ్యన శివుని పీఠం, వీటి గురించిన ఒక ఆసక్తికరమైన సమాచారం లభిస్తుంది. వాటినలా ఉంచితే కొన్ని ఝల్లుమనే వర్ణనలు ఈ దృశ్యకావ్యంలో కనిపిస్తాయి.

ఈ భాణకర్త గురించిన ఒక ఆభాణకం ఈ విధంగా ప్రచారంలో ఉంది.

వరరుచిరీశ్వరదత్తః శ్యామిలకః శూద్రకశ్చ చత్వారః |
ఏతే భాణాన్ వభణుః కా శక్తిః కాళిదాసస్య ||

భాణం వ్రాయటానికి వరరుచి, ఈశ్వరదత్తుడు, శ్యామిలకశూద్రకులే సాటి.వారు వ్రాసినట్టి భాణాలను కాళిదాసు కూడా

వ్రాయలేదని ఆ శ్లోకార్థం.

సంస్కృత సాహిత్యంలో శూద్రకకవికి విశిష్టమైన స్థానం ఉంది. ఈ మహాకవి తన రచన మృచ్ఛకటికంలో పారంపర్యంగా వచ్చిన దివ్యప్రకృతులను, దివ్యాదివ్యులను పాత్రధారులుగా స్వీకరించక, సాధారణ మానవులను, అతి సాధారణంగా సమాజంలో జరిగే సంఘటనలను రచనలో భాగంగా చేసుకుని అపూర్వమైన నాటకీయత సృష్టించాడు. నాయకుడు దరిద్రుడు – అయినా కించిత్తు కూడా ఇతరుల వస్తువులనాశించడు, నాయిక వేశ్య – అయినా సౌశీల్యవతి. ఒక దొంగ – కేవలం తన చెలి కోసం దొంగతనం చేస్తాడు. జూదమాడిన వ్యక్తి బౌద్ధభిక్షువై నాయిక ప్రాణాలను కాపాడతాడు. ఇలా మృచ్ఛకటికంలో ప్రతి పాత్ర పైకి సాధారణంగా కనిపించినా అసాధారణమైన ఉదాత్తత కలిగి ఉంటుంది. పద్మప్రాభృతకంలోనూ ఉజ్జయినీ నగరసమాజం, పైకి ఉదాత్తంగా కనిపించే ధూర్తులు, మనుష్యులలో కృతకత్వం, నాటి కాలపు వేశ్యావృత్తి, వేశ్యల అలంకరణలు ఇటువంటి అతి సహజమైన సమాజప్రవృత్తిని చిత్రించాడు శూద్రక మహాకవి.

ఈ భాణంలో పాణినిదత్తకలశుడనే కృతక వ్యాకరణపండితుడు, పవిత్రకుడనే భ్రష్ట బ్రాహ్మణుడు, సంఘిలకుడనే దుష్టబౌద్ధభిక్షువు, ఇరిముడు (Herms) అనే యవనుడు, దూతిగా తన ఇంటికి వచ్చిన బౌద్ధ సన్యాసినిని చెరబట్టిన శైషిలకుడు, బంతాట ఆడే ఒక తరుణ యువతి, ఇంకా విటులు, కవులు, కులవధువు ... వీరి స్వభావాలను అతి సహజంగా వర్ణించాడు శూద్రకమహాకవి. నాటికీ నేటికీ తరచి చూస్తే వేషభాషల్లోనే మార్పు. మనుషుల స్వభావాలలో మార్పు లేదు. శూద్రకకవి చూపించిన పాత్రలు నేడూ మనకు సజీవంగా కనిపిస్తాయి. ఆ విధంగా ఈ భాణం, విలక్షణమైనదైనా, విశిష్టమైనది.

భాణమనే ఏకాంకిక కాస్త ఒకే మూసలో ఉన్నప్పటికీ కాస్త అలవాటు పడితే ఆసక్తికరంగా చదివిస్తుంది.

**భాణం**

---

సంస్కృతనాటకాలు పదిరకాలు. ఈ భేదాలు నాయకుడు, ఇతివృత్తం, రసం అన్న అంశాలను బట్టి విభజింపబడినాయి.అవి

నాటకం ప్రకరణం భాణః ప్రహసనం డిమః |
వ్యాయోగసమవకారౌ వీథ్యఙ్కేహామృగ ఇతి ||

నాటకం, ప్రకరణం. భాణం, ప్రహసనం, డిమము, వ్యాయోగము, సమవకారము, వీథి, అంకము, మరియు ఈహామృగము. ఈ పదింటిని కలిపి దశరూపకాలు అంటారు. ఇందులో **భాణం** లక్షణాలు ఇవి.

- ధూర్తచరితం కావాలి.
- స్వచరితం కానీ, ఇతరుల చరితం కానీ కావచ్చు.
- చతురుడు, బుద్ధిమంతుడైన విటుడు నాయకుడు కావాలి.
- ఉక్తి, ప్రత్యుక్తి ఆకాశభాషణం అనే ప్రక్రియ ద్వారా జరగాలి.

- వీరము లేదా శృంగారము ప్రధానమై ఉండాలి.
- ఇతివృత్తం కల్పితమై ఉండాలి.
- ఏకాంకిక, భారతీవృత్తి సహితమై ఉండాలి.
- ముఖ, నిర్వహణ సంధులు ఉండాలి.
- లాస్యాంగముల నిర్వహణ ఉండాలి.

విటుడు అంటే – గీతాది విద్యలలో నిష్ణాతుడై, నాయకుని సహాయపడే పాత్రధారి.

ఆకాశభాషణం – అంటే యవనికపై ఎదుట వ్యక్తి లేకయే, ఆ వ్యక్తిని ఉన్నట్టు సూచించి, అతడు చెప్పే మాటలను కూడా తనే "ఏమంటున్నావూ?" అని తనే చెబుతూ ఆకాశంతో మాట్లాడినట్టుగా ప్రవర్తించుట.

భారతీవృత్తి అంటే యవనికపై దృశ్యముకన్నా వాక్కునకు ప్రాధాన్యత గల సంవిధానము. (ఒక రకంగా భాణము శ్రవ్యకావ్యమని చెప్పుకోవచ్చును)

దాదాపుగా పై లక్షణాలన్నిటినీ పద్మప్రాభృతకం కలిగి ఉందనే చెప్పవచ్చు.

## కవికాలాదులు

సంస్కృతభాషలోని ఇతరకవుల కాలనిర్ణయం లాగానే శూద్రకమహాకవి కాలం విషయం కూడా గందరగోళంగా ఉంది. ఈ మహాకవి రచనలలోని నాటకీయతలాగానే ఈయన కాలాన్ని గుర్తించడం ఒక అపూర్వమైన విషయంగా మారింది. మృచ్ఛకటికంలో శకారుడు అనే పాత్ర చాణక్యుని ప్రస్తావిస్తాడు.

అంధ ఆలే పలా అంతీ మల్లగంధేణ శూ ఇదా |
కేశవిందే పలామిట్టా చాణక్కేనేవ్వ దోఅదీ ||
(మృచ్ఛకటికం ౧-౩౯)

కాబట్టి తప్పకుండా శూద్రకమహాకవి చాణక్యుని తర్వాతి కాలపు కవి అని చెప్పవచ్చు. భాస మహాకవి ప్రతిమానాటకంలో అర్థశాస్త్రానికి చాణక్యుని పేరు చెప్పక, బృహస్పతి పేరును ఉటంకించాడు కాబట్టి, భాసునికి చాణక్యుడు తెలిసి ఉండడని ప్రాజ్ఞులు అంటున్నారు. అంటే భాసుడు చాణక్యునికి పూర్వుడు. శూద్రకుడు చాణక్యుని ప్రస్తావించాడు కనుక భాసుని తర్వాతి కవి.

మృచ్ఛకటికంలోనూ, పద్మప్రాభృతకంలోనూ బౌద్ధభిక్షువు పాత్రలున్నాయి. మృచ్ఛకటికంలోని బౌద్ధకాలమూ, నాటకంలో కనిపించే ప్రాచీనమైన ప్రాకృతభేదాలను చూచి, ఆ కాలం శాతవాహన వంశమూల పురుషుడైన శ్రీముఖ శాతవాహనుని కాలమని కొందరు

ఊహించారు. సిముకుడు – అనే శ్రీముఖుడే శూద్రకుడని మరి కొందరు. కాదు కాదు ఆంధ్రులకు మూలపురుషుడైన శివదత్తుడే శూద్రకుడని మరికొందరు.

ఆ కాలగణన అటుంచితే శూద్రకుడు అన్న మహారాజు పాత్ర సంస్కృతసాహిత్యంలో అనేక కావ్యాలలో చోటుచేసుకుంది. ఆ ప్రస్తావనలన్నీ వివరిస్తే అదొక కావ్యమవుతుంది.

ఏదేమైనా, శూద్రకమహాకవి భారతీయ సాహిత్యంలో, ఆ మాటకొస్తే ప్రపంచ సాహిత్యంలో విలువకట్టలేని వజ్రం. మృచ్ఛకటికం భాసనాటకమైన చారుదత్తానికి విస్తృతి అని అనేకులు నిర్ధారించారు. అలా అన్నా, శూద్రకమహాకవి స్వతంత్రతకూ, స్వోపజ్ఞతకూ వచ్చిన నష్టమేదీ లేదు.

ఈయనను ప్రాచీనభారతదేశకవి అనుకుంటే సరిపోతుంది. లేదూ కాలం ఖచ్చితంగా తెలియాలంటే – క్రీ.పూ. రెండవ శతాబ్దం నుండి క్రీ.శ. రెండవశతాబ్దం మధ్యన అని అనుకోవచ్చు.

## మూలదేవుడు

కర్ణీసుతుడు , మూలదేవుడు, మూలభద్రుడు లేదా కలాఙ్కురుడు అన్న పేరు సంస్కృతసాహిత్యంలో పలుచోట్ల వినిపిస్తుంది. ఈ పాత్ర బహువిస్తృతమైన సంస్కృతసాహిత్యవినీలాకాశంలో ఒకానొక విశిష్టమైన తార. క్రీ.పూర్వం రెండవశతాబ్దం మొదలుకుని పదకొండవ శతాబ్దంలో క్షేమేంద్రుని కళావిలాసం వరకూ, బహుశా ఆపైన కూడా,      సాహిత్యంలో చెదురుమదురుగా ఈ మూలదేవుని ప్రస్తావనలు వినిపిస్తాయి. ఆధునిక కాలంలో మూలదేవుని గురించి Maurice Bloomfield అనే పాశ్చాత్య ప్రముఖుడు ప్రముఖంగా పరిశోధించాడు. Bloomfield గారి పరిశోధనాకాలానికి (క్రీ.శ. 1913) చతుర్భాణి వెలువడలేదు. అందుకని ఆయన వ్యాసంలో మూలదేవుడు ఒక పౌరాణిక పాత్రగా అనిపిస్తాడు. అయితే పద్మప్రాభృతకంలోని మూలదేవుడు మానవాతీత లక్షణాలు కలవాడు కాదు. అందుచేత మూలదేవుని ఒక చారిత్రక వ్యక్తిగా ఊహించవచ్చు.

పద్మప్రాభృతకం కర్ణీపుత్రునికై శశుడు చేసిన యాత్ర కాబట్టి  స్థూలంగా ఈ మూలదేవుని ప్రస్తావనలను, ఆ పాత్ర తీరుతెన్నులను గురించి తెలుసుకుందాం.

– " ...కర్ణీసుత కథేవ సన్నిహిత విపులాచలా శశోపగతా చ..." బాణభట్టు కాదంబరిలో వింధ్యాటవీ వర్ణనలోని ఒక వాక్యం ఇది. వింధ్య – కర్ణీసుతుని కథలాగా దగ్గరగా ఉన్న విపులమైన శిఖరాలతోనూ, శశ అనబడే లోధ్రవృక్షాలతో కూడినది గాను ఉన్నదని ఒక అర్థం. మరొక అర్థం – కర్ణీసుతుని కథలాగా విపుల, అచల, ఇంకా శశులతో కూడినదిగా ఉన్నదని మరొక అర్థం. బాణభట్టు ఉటంకించిన విపుల ఉదంతం మన పద్మప్రాభృతకంలో వస్తుంది. అచల – అన్న పేరు వెనుక ఏముందో తెలియదు. మానవల్లి రామకృష్ణకవి గారు ఒకచోట కర్ణీసుతుని జన్మస్థానం వింధ్యపర్వత ప్రాంతాలనున్న అచల అన్న జనపదమని పేర్కొన్నారు. కవి అలా చెప్పడానికి కారణం తెలియదు. అయితే పద్మప్రాభృతకం ప్రకారం కర్ణీసుతుడు పాటలీపుత్రానికి చెందినవాడు. అతని

కార్యక్షేత్రం ఉజ్జయిని.

– "...కర్ణీసుత ప్రహితే పథి మతిమకరవమ్" – దండి దశకుమారచరితమ్ లో అపహారవర్మ కథ లో అపహారవర్మ చెప్పిన మాట ఇది. కర్ణీసుతుడు చూపిన మార్గంలో బుద్ధిని నిలుపుదాం అని అర్థం. ఈ కథను అపహారవర్మ చెప్పగానే రాజహంసుడు – "ఆహా, నీ తెలివి కర్ణీసుతుని మించిపోయింది కదా" అంటాడు.

కథాసరిత్సాగరంలో భేతాళపంచవింశతి కథలలో పదిహేనవ కథలో మూలదేవుడు ప్రధానపాత్రధారి. ఆ కథ స్థూలంగా ఇది. మనఃస్వామి అనే ఒక బ్రాహ్మణకుమారుడు ఒక మదపుటేనుగు బారి నుండి శశిప్రభ అనే యువరాణిని రక్షించి ఆపై ప్రేమలో పడతాడు. తన ప్రేమ సఫలం కావాలని ఉపాయం చెప్పమని ధూర్తసిద్ధుడు మూలదేవుని దగ్గరకు వెళతాడు. మూలదేవుడు ఒక గుళిక సాయంతో మనఃస్వామిని స్త్రీగా మార్చి, రాజుతో చెప్పి యువరాణికి చెలికత్తెగా అమరుస్తాడు. యువరాణికి చెలికత్తెగా స్త్రీవేషంలో ఉన్న మనఃస్వామి అదను చూచి ఏకాంతంలో యువరాణికి తన గురించి చెప్పి నోటనున్న గుళికను తీసివేసి పురుషుడిగా మారి ఆమెతో సుఖిస్తాడు. ఇలా ఈ కథ ప్రకారం మూలదేవుడు మాయమంత్రాలు నేర్చి, మానవాతీతమైన చర్యలు చేయగల ఒక ధూర్తసిద్ధుడు. ఈ భేతాళకథలలో మరొక కథలోనూ మూలదేవుడు కనిపిస్తాడు. శుకసప్తతి కథల్లోనూ ఒక కథ ఇలాంటిది ఉంది. సుబంధుని వాసవదత్త కథాకావ్యంలో స్వయంవర వృత్తాంతంలో ఈ కర్ణీసుతుడు కలాఙ్కురుడుగా కనిపిస్తాడు.

ఎవరైనా మహాసత్వుడైన మనిషిని జీవించిన కాలంలో సాధారణంగానే చూచినా, మరణించిన తర్వాత, అతని చుట్టూ అభూతకల్పనలను ఏర్పరుచుకుని మానవాతీత శక్తులను అలాంటి వ్యక్తికి ఆపాదించటం మానవులసహజప్రవృత్తి. కథాసరిత్సాగరానికి బృహత్కథ మూలం. బృహత్కథ నాటికి మూలదేవుడు మహిమలు చూపెట్టే, మానవాతీతశక్తులు గల మాయగాడు. అంటే బృహత్కథ కంటే కనీసం నూటయేభై, ఇన్నూరు యేండ్లకు పూర్వమే మూలదేవుడు మరణించి ఉండాలి. పద్మప్రాభృతకంలో మూలదేవుడు సహజమైన మనిషే కాబట్టి, బహుశా ఈ భాణం కర్ణీసుతుని కాలానికి దగ్గరగా ఉండే అవకాశం ఉంది. అంటే శూద్రకమహాకవి బృహత్కథకంటే చాలా ముందుకాలం నాటి వ్యక్తే కావాలి.

జైనసాహిత్యంలోనూ మూలదేవుని ప్రస్తావనలు కనిపిస్తాయి. ధూర్తాఖ్యానం అన్న ఒక కథామాలికలో మూలదేవుడు ఒక ధూర్తుడు. ధూర్తాఖ్యానానికి కర్త హరిభద్రసూరి.

ఇలా రకరకాల ఉదంతాలలో వచ్చే ఈ కర్ణీసుతుడు – అరవై నాలుగు కళలలో ఒకటైన చోరకళకు సంబంధించిన స్తేయశాస్త్రకర్త అని వ్యాఖ్యాతలు పేర్కొన్నారు. (ఈ స్తేయశాస్త్రం కాలగర్భంలో కలిసిపోయింది) Bloomfield గారు గోణికీపుత్ర అన్న పేరు కూడా మూలదేవునిదేనని సూచించారు. ఈ గొణికీపుత్రుడు ఒకానొక కామశాస్త్రప్రవర్తకుడు. క్షేమేంద్రుని కళావిలాసంలో మూలదేవుడు రకరకాల ధూర్తులను, ధూర్తపద్ధతులను వివరిస్తాడు. కళావిలాసంలో మొదటి సర్గలో దాంభికులకు ఇచ్చిన ఉదాహరణ పద్మప్రాభృతకంలోని పవిత్రకుని పాత్రను పోలి ఉంటుంది.

ఈ కర్ణీసుతుని వర్ణన పద్మప్రాభృతకం లో ఇది.

కులే ప్రసూతః శ్రుతవానవిస్మితః
స్మితాభిభాషీ చతురో విమత్సరః |
ప్రియంవదో రూపవయోగుణాన్వితః
శరీరవాన్ కామ ఇవాऽధనుర్ధరః ||

కర్ణీపుత్రుడు కులీనుడు, పండితుడు, గంభీరుడు, స్మితభాషి, చతురుడు, మాత్సర్యము లేనివాడు, మృదుభాషణుడు, రూపయౌవనగుణసంపన్నుడు, శరీరమున్ననూ, ధనుస్సు లేని మన్మథుడు.

## మనవి

శూద్రక మహాకవి కృతి, మానవల్లి వారు వెలికితీసిన వజ్రం అయిన ఈ పద్మప్రాభృతకాన్ని తెనుగు చేయడం, శక్తికి మించిన సాహసం. అయితే తెలుగులో ఎవ్వరూ పూనుకోని కారణంగా ఈ పని చేయవలసి వచ్చింది. ఇందులో వెతికితే దోషాలు కనబడవచ్చు. అయితే ప్రయత్నంలో లోపం లేదని, తప్పులు దిద్దుకోవడంలో వెనుకంజ లేదని వినయపూర్వకమైన మనవి.

ఈ చతుర్భాణికి మూలం 1949 లో మోతిచంద్ర శ్రీ గారి సంస్కృతపాఠం. హిందీ అనువాదం.

చతుర్భాణిని రేడియో మామయ్య – బాలాంత్రపు రజనీకాంతరావు గారు అనువాదం చేశారని నాకు ఈ టీక, వ్యాఖ్యానం పూర్తి చేసిన తర్వాత శ్రీ పరుచూరి శ్రీనివాస్ గారి ద్వారా తెలిసింది. శ్రీనివాస్ గారికి కృతజ్ఞతలు.

ఈ పుస్తకం వ్రాసి పూర్తయిన తర్వాత అవధాని డాక్టర్ మాడుగుల అనిల్ గారికి పంపితే, వారు ఎంతో దయతో మొత్తం పరిశీలించి ఛందస్సులకు సూత్రాలను, అర్థదోషాలను, అక్షరస్ఖాలిత్యాలను, ఒక ఛందోభంగాన్ని సూచించటమే కాక, మరికొన్ని సలహాలు సూచించారు. వాటినన్నిటినీ పొందుపర్చడం జరిగింది. వారికి కృతజ్ఞతాంజలి.

# పద్మప్రాభృతకమ్

[నాంద్యన్తే ప్రవిశతి సూత్రధారః]

సూత్రధార –

జయతి భగవాన్ స రుద్రః
కోపాదథవాఽప్యనుగ్రహాత్ యేన |
స్త్రీణాం విలాసమూర్తిః
కాన్తతరవపుః కృతః కామః ||

అపి చ –

---

[నాంది అంతమందు సూత్రధారుడు ప్రవేశించుచున్నాడు]

సూత్రధారుడు –

యేన = ఎవని, కోపాత్ అథవాఽపి అనుగ్రహాత్ = కోపము వలన లేదా అనుగ్రహము వలన, స్త్రీణాం = స్త్రీలయెడ, విలాసమూర్తిః = విలాసమూర్తియు, కాన్తతరవపుః = శోభించు శరీరము కలవాడునుగా, కృతః = చేయబడినవాడైన, కామః = మన్మథుడు (కలడో), సః భగవాన్ రుద్రః = అట్టి భగవంతుడైన ఈశ్వరుడు, జయతి = విరాజిల్లుచున్నాడు.

తాత్పర్యము: ఎవని కోపము మరియు అనుగ్రహము వలన స్త్రీల యెడ విలాసమూర్తి, కాన్తివంతమైన శరీరము కలవాడుగా చేయబడిన మదనుడు కలడో, అట్టి రుద్రుడు విరాజిల్లుచున్నాడు.

*విశేషములు: కాన్తతరవపుః = అగ్నిచేత కాల్చబడిన పుత్తడి ఎలా మిక్కుటముగా శోభించునో, అలా ఈశ్వరకోపాగ్ని చేత కాల్చబడిన మన్మథుడు మెరుగుపెట్టబడిన కాంతి కలవాడాయెననుట. ఆర్యా వృత్తము*

ఇంకనూ –

పుష్పసముజ్జ్వలాః కురవకా నదతి పరభృతః
కాన్తమశోకపుష్పసహితం చలతి కిసలయమ్ |
చూతసుగన్ధయశ్చ పవనా భ్రమరరుతవహాః
సమ్ప్రతి కాననేషు సధనువిచరతి మదనః ||

కిఞ్చాన్యత్ –

---

పుష్పసముజ్జ్వలాః = మిక్కుటముగా పూచిన పూలుకలవైన, కురవకా = కురవకమను వృక్షము తో, పరభృతః = కోకిల, నదతి = మోదమందుచున్నది. కిసలయం = చివురుటాకు, కాన్తం = సుందరమైన, అశోకపుష్పసహితం = అశోకకుసుమసహితముగ, చలతి = కదలుచున్నది. పవనాః = గాలులు, భ్రమరరుతవహాః = తుమ్మెదలగానములను మోయుచూ, చూతసుగన్ధయః చ = లేత మామిడి పిందెల సువాసనలను కలిగినవి. సంప్రతి = ఇప్పుడు, కాననేషు = ఉద్యానములలో, మదనః = మదనుడు, సధను = ధనువుతో కూడి, విచరతి = విహారము చేయుచున్నాడు.

తాత్పర్యము: కురవక కుసుమశోభచేత కోకిల ఆనందించుచున్నది. అశోకపుష్పమును కూడి చివురుటాకు కదలుచున్నది. మందమారుతములు తుమ్మెదగానములను, మావి సుగంధములను వీయుచున్నవి. ఇప్పుడు మదనుడు ధనువిహారము చేయుకాలము.

*విశేషములు: నాంది తర్వాత ప్రస్తావనలో ఋతువర్ణన చేయడం ఐచ్ఛికమైన ఒక అంశం. ఇక్కడ వసంతకాలవర్ణన. స్వభావోక్తి అలంకారం.*

ఇంకేమిటి –

ఆతోద్యం పక్షిసంఘాస్తరురసముదితాః కోకిలా గాన్తి గీతం
వాతాచార్యోऽపదేశాదభినయతి లతా కాననాన్తః పురస్త్రీః |
తాం వృక్షాః సాధయన్తి స్వకుసుమహృషితాః పల్లవాగ్రాంగుళీభిః
శ్రీమాన్ ప్రాప్తో వసన్తస్త్వరితమపగతో హారగౌరస్తుషారః ||

---

పక్షిసంఘాః = పక్షిసమూహములు, ఆతోద్యం = నేపథ్యవాద్యమున, తరురసముదితాః = చెట్లస్రావములను త్రావినవి (అయి), కోకిలాః = కోకిలలు, గీతం = గానములను, గాన్తి = గానము చేయుచున్నవి. కాననాన్తఃపురస్త్రీః = ఉద్యానవనమనెడు అంతఃపురమందు నివసించు యువతి, లతా = తీవె, వాతాచార్యోపదేశాత్ = గాలి అనెడు ఆచార్యుని ఉపదేశము వలన, అభినయతి = అభినయించుచున్నది.తాం = ఆ తీవెను, స్వకుసుమహృషితాః = తన యందు కుసుమించిన పూలచేత సంతుష్టినందినదానిని, వృక్షాః = వృక్షములు, పల్లవాగ్రాంగుళీభిః = చివురుటాకుల చేతి వ్రేళ్ళతో, సాధయన్తి = పరామర్శించుచున్నవి. హారగౌరః తుషారః = గౌరవర్ణహారమయమైన మంచు, త్వరితం = త్వరగా, అపగతః = వెడలినది. శ్రీమాన్ వసన్తః = శ్రీమంతుడైన వసంతుడు ప్రాప్తః = దయచేసెను.

తాత్పర్యము: పక్షుల నేపథ్యవాయిద్యమున రసపానమత్తములైన కోయిలలు గానమొనర్చుచున్నవి.  ఉద్యానవనాంతఃపురస్త్రీ యనెడు తీవె అనిలాచార్యోऽపదేశమును అభినయించుచున్నది. తనయందు కుసుమించిన పూలతో కూడిన యా లతలను వృక్షములు తమ చేతి వ్రేళ్ళతో సాధించుచున్నవి. హారములను వలె తెల్లటి మంచు త్వరితముగా వెడలిపోయినది. శ్రీమంతుడు వసంతుడేతెంచెను.

*విశేషములు: సమాసోక్తి . నాట్యశాస్త్ర పరామర్శ నెపమున ప్రకృతార్థమైన వసంతము వర్ణింపబడినది. ఈ పద్యములో ఇతివృత్తము సూచితము. పక్షుల దరువులు, ఈ భాణమున కాన్పట్టు పాత్రలు చెప్పెడు మాటలు. వాటిని నేపథ్యీకరించి చేయు గానము శశు దను విటుని మాట. హారగౌరమైన తుషారము వెడలుట ప్రథమ నాయిక అవగమనమును, వసంతప్రాప్తి నూత్ననాయిక సంప్రాప్తిని సూచించుచున్నది. (స్రగ్ధరా – మ ర భ న య య య)*

*ఆతోద్యము : భరతుని నాట్యశాస్త్రమున నాట్యమునకేకాదశాంగములు సూచింపబడినవి. అందుననాతోద్యము ఒకటి. ఈ ఏకాదశాంగముల స్వరూపమే నాట్యశాస్త్రసంగ్రహము.*

*రసభావాహ్యభినయాః ధర్మీవృత్తిప్రవృత్తయః |*
*సిద్ధిః స్వరాః తథాతోద్యం గానం రంగశ్చ సంగ్రహః ||*

*ఆతోద్యములు నాలుగు తెఱగులు. తతము (తంత్రీగతము. ఉదా:వీణ), అవనద్ధము (చర్మముచే మూయబడినది. మద్దెల), ఘనము (కంచుతాళములు), సుషిరము(వేణువు).*

మూలాదపి మధ్యాదపి విటపాదప్యఙ్కురాదశోకస్య |
పిశునస్థమివ రహస్యం సమన్తతో నిష్కసతి పుష్పమ్ ||

అహో అయమ్ –

ససంభ్రమపరభృతరుతః ససింధువారః సకున్దసహకారః |
సమదమదనః సపవనః సయౌవనజనప్రియః కాలః ||

(నిష్క్రాన్తాః)
(స్థాపనా)

---

మూలాదపి = మూలమునందు, మధ్యాదపి = మధ్యయందు, విటపాదపి = కొమ్మలపై, అశోకస్య = అశోకకుసుమంపు, అంకురాత్ = మొగ్గలలో, పిశునస్థం = ఖలునియందు ఉంచిన, రహస్యమివ = రహస్యము వలె, సమన్తతః = బాగుగా విచ్చికొని, పుష్పమ్ = కుసుమము, నిష్కసతి = విప్పారుచున్నది.

తాత్పర్యము:మూలలో, మధ్యలోనూ, కొమ్మలపైననూ, అశోకపుష్ప మొగ్గలలోనూ, ఖలుని యందు దాచిన రహస్యము వలె కుసుమము విచ్చి బయల్వెడలుచున్నది.

*విశేషములు: ఆర్యా. పిశునస్థ రహస్యమివ సమన్తతో నిష్కసతి పుష్పమ్ – ఉపమాలంకారము.*

అహో, ఇది –

కాలః = కాలము, ససంభ్రమపరభృతరుతః = కోకిలగానము సంభ్రమముతో కూడియున్నది, ససింధువారః స కుందసహకారః = సింధువార, కుంద, లే మామిడి వృక్షములతో శోభించుచున్నది, సమదమదనః = మదించిన మదనుని కలిగినది, సపవనః = చక్కని గాలులతో కూడినది, సయౌవనజనప్రియః = యౌవనజనులతో ప్రియమైనది.

తాత్పర్యము: కాలము కోకిలగానములచేత సంభ్రమము. సింధువార, కుందములచేత, లేమావిళ్ళచేత, మదనునిచేత, గాలులచేతనూ కూడినది. నవయువకులకు ప్రియభాజనమైనది. ఆర్యావృత్తము.
– (నిష్క్రమింతురు).
– (స్థాపనా). *(ఈ స్థాపనా అన్న శబ్దము కేవలం భాసనాటకములందే గానవచ్చును . ఇతర సంస్కృతనాటకాలలో ప్రవేశకము అని దీని పేరు. ఈ శబ్దప్రయోగం ఈ భాణక ప్రాచీనతను సూచించుచున్నది.)*

[తతః ప్రవిశతి విటః]

సాధు భోః |రమణీయం ఖలు తావదిదం శిశిరజరాజర్జరస్య సంవత్సరవిటస్య హిమరసాయనోపయోగాత్ వసన్తకైశోరకముపోహ్యతే |సమ్ప్రతి హి –

ప్రచలకిసలయాగ్రప్రనృత్తద్రుమం యౌవనస్థాయతే ఫుల్లవల్లీపినద్ధం వనమ్
తిలకశిరసి కేశపాశాయతే కోకిలః కున్దపుష్పే స్థితః స్త్రీకటాక్షాయతే షట్పదః |
క్వచిదచిరవిరూఢవాలస్తనీ కన్యకేవోద్గతైః శ్యామలైః కుడ్మలైః పద్మినీ శోభతే
వరయువతిరతిశ్రమఖిన్నపీనస్తనస్పర్శధూర్తాయితా వాన్తి వాసన్తికా వాయవః ||

---

– (అంతట విటుని ప్రవేశము)

– భళీ! శిశిరమనే ముసలితనపు మిండెగానికి మంచు అను వాజీకరణోపయోగము వలన ఆమని యను సింహబలము చేకూరినయట్టు రమణీయముగ నున్నది. ఇప్పుడేను –

ప్రచలకిసలయాऽగ్రప్రనృత్తద్రుమం = మిక్కిలి చలించుచున్న చివురుటాకులతో నృత్యం చేస్తున్న వృక్షాలను, ఫుల్లవల్లీపినద్ధం = కుసుమించిన పూలను, (కలిగి) వనమ్ = ఉద్యానము, యౌవనాస్థాయతే = యౌవనము సంతరించుకొన్నది, తిలకశిరసి = తిలకపుష్పముపై, కోకిలః = కోకిల, కేశపాశాయతే = కేశపాశముగనున్నది. షట్పదః = తుమ్మెద, కుందపుష్పే స్థితః = కుందపుష్పముపై కూర్చున్నదై, స్త్రీకటాక్షాయతే = స్త్రీలా కటాక్షం చూపుతున్నది, క్వచిదచిర విరూఢవాలస్తనీ కన్యకేవ = అందమైన పయోధరం గల యువతి వలె, ఉద్గతైః శ్యామలైః కుడ్మలైః = అంకురించిన నల్లని మొగ్గగల, పద్మినీ = కలువ, శోభతే = శోభించుచున్నది. వాసన్తికా వాయవః = ఆమని గాలులు (లేదా మాధవీలతల పరిమళాలు), వరయువతి రతిశ్రమఖిన్నపీనస్తనధూర్తాయితా = రతిశ్రమ తో ఖిన్నయైన ఒక సుందరి పీనవక్షాలను స్పృశించాలన్న ధూర్తమైన ఆలోచనతో, వాన్తి = వీయుచున్నవి.

తాత్పర్యము: చలిస్తున్న చివురుటాకులతో నృత్యం చేస్తున్న వృక్షాలతోనూ, వికసించిన పూలతోనూ, వనం యౌవనం సంతరించుకున్నది. కోకిల తిలక వృక్షం పై కేశపాశంగా అమరినది. తుమ్మెద మల్లెపూవుపై వ్రాలి స్త్రీలా కటాక్షం చూపుతున్నది. తొడుగుతున్న నల్లతామర మొగ్గ – అందమైన యువతి పయోధరం లాగా శోభిస్తుంది. వాసన్తికా మందమారుతములు రతిశ్రమ తో ఖిన్నయైన ఒక సుందరి పీనవక్షాలను స్పృశించాలన్న ధూర్తమైన ఆలోచనతో వీస్తున్నాయి.

*విశేషములు: వాసంతికా = వసంతసంబంధమైనవి అని ఒక అర్థం. వాసంతి అంటే మాధవీలత అని మరొక అర్థం. (అతిముక్తః పుణ్డ్రకస్స్యాత్ వాసన్తీ మాధవీలతా – అమరం)*

ఇత్థం చ మదనశరసన్తాపకర్కశో బలవానయం ఋతుః యద్దేవదత్తాసురతసుప్రతివిహితయౌవనోత్సవస్య కర్ణీపుత్రస్యోన్ముచ్యమానబాలభావయౌవనావతారకోమలాం మదనమఞ్జరికాం దేవసేనాచూతయష్టిమతిలఙ్ఘ్యతే మదనభ్రమరః |అథవా కిమివ కర్ణీపుత్రస్యాఽతిక్రమిష్యతి | సమధుపిష్కం హి పరమన్నం సోపదంశమాస్వాద్యతరం భవతి, అతః శఙ్కే దేవదత్తాసురతమధుపానోపదంశభూతం చణ్డాలికాశ్రయం బాలభావనిరుపస్కృతోపచారహసితలలితరమణీయం దారికాసున్దరీరతి రసాన్తరమపి ప్రార్థయత ఇతి |

అహో ను ఖల్వయం లఘురూపోఽపి బలవాన్ మదనవ్యాధిః, యేనానేకశాఖాధిగతనిష్పన్నబుద్ధిః సర్వకాలజ్ఞానవిచక్షణో వ్యుత్పన్నయువతికామతంత్రసూత్రధారః కర్ణీపుత్రోఽపి నామైతామవస్థాముపనీతః | స హి –

---

*తిలకశిరసి కేశపాశాయతే – అను వర్ణన అప్పటి స్త్రీల కేశపాశమును వివరించును. అశ్వఘోషుని సౌందరనందమున నీ కేశపాశ వర్ణన గలదు.*

*పుష్పావనద్ధే తిలకద్రుమస్య దృష్ట్వాఽన్యపుష్టాం శిఖరే నివిష్టామ్ |*
*సంకల్పయామాస శిఖాం ప్రియాయాః శుక్లాంశుకాఽట్టాలమపాశ్రితాయాః || (సౌందరనందము ౭-౭)*

*(తెల్లటి పూలతో విరగపూచిన తిలకపు చెట్టు కొమ్మ పైన కూర్చున్న కోకిల ను చూచి మేడపైన ప్రియురాలి సిగపైన తెల్లటి పట్టువస్త్రంతో చుట్టిన కేశపాశాన్ని నందుడు తలచెను).*

– చెఱకువిలుకాని కరకు కోలలతో సంతాపము కలిగించు కర్కశమైనది ఈ వసంతఋతువు. దేవదత్త తో కూడి శృంగారక్రీడలంగూడి యౌవనోత్సవములను జరుపుకొనియూ కర్ణీపుత్రుడను ఈ మదనరూప భ్రమరము బాల్యావస్థ వీడి యౌవనము నొందిన దేవసేన యను లేత మామిడికై యెగురుచున్నది. అట్లు కాక, కర్ణీపుత్రుడునూ కామమున మగ్గుట యెట్లు? మధువు(తేనె)ను బాగుగా కలిపిన పరమాన్నము అధికముగనాస్వాద్యమగును. ఆలోచించిన – ఆ పదునారు వర్షములతరుణయవ్వని దేవసేనను (*చండాలిక యని ప్రయోగము. ఇది నీచత్వసూచన కాదు. పదునారు వర్షముల యువతిని చండాలిక/మాతంగిని గా పూజించుట తంత్రశాస్త్ర సాంప్రదాయము*) కూడుట దేవదత్తయను సురాపానముతో బాటు కలిగిన ఉపదంశము(*చిఱుతిండి. సురాపానముతో బాటు అప్పడము, కారము గల ఏదైనా ఒక చిరుతిండి*) . దేవసేనయందు బాలభావము యొక్క హసిత లలితరమణీయత్వము నిండుటచే ఆమెనాశించుచున్నాడు కాబోలు.

అహో! చిన్నదియైననూ మదనవ్యాధి బలతరమైనదే సుమా! దీనివలన అనేకశాస్త్రాదులను యనుశీలనము జేసి సంపాదించిన బుద్ధి కలిగి, అన్ని కాలములలోనూ జ్ఞానమూ విచక్షణా గలిగి యువతుల కామతంత్రములకు సూత్రధారుడయిన కర్ణీపుత్రుడు నూ ఈ యవస్థను పొందినాడు. అందుకే –

ఉన్నిద్రాధికతాన్తతామ్రనయనః ప్రత్యూషచన్ద్రాననో
ధ్యానగ్లానతనూవిజృంభణపరః సన్తప్తసర్వేంద్రియః |
రమ్యైశ్చన్ద్రవసన్తమాల్యరచనాగాన్ధర్వగన్ధాదిభిః
యైరేవ ప్రముఖాగతైః స రమతే తైరేవ సన్తప్యతే ||

అథవా దేవసేనాముద్దిశ్య నైతదాశ్చర్యమ్ | కుతః | శ్లాఘ్యమన్మథమనోరథక్షేత్రం హి సా దారికా | అర్హత్యస్యా రూపయౌవనలావణ్యం కర్ణీపుత్రస్యోన్మాదం జనయితుమ్ | తస్యా హి –

విభ్రాన్తేక్షణమక్షతోష్ఠరుచకం ప్రాచీనగణ్డం ముఖం
ప్రత్యగ్రోత్పతితస్తనాంకురమురో బాహూలతా కోమలీ |
అవ్యక్తోత్థితరోమరేఖముదరం శ్రోణీ కుతోఽప్యాగతా
భావశ్చానిభృతస్వభావమధురః కం నామ నోన్మాదయేత్ ||

---

ఉన్నిద్రాధికతాన్త తామ్రనయనః = మిక్కిలియైన నిద్రాభావము చేత ఎఱుపెక్కిన కన్నులు కలిగినవాడు, ప్రత్యూషచంద్రాననః = ఉషఃకాల చంద్రుని వంటి మోము కలవాడు, ధ్యానగ్లానతనూవిజృంభణాపరః = చింతతో పెరిగిన శరీరము కలవాడు, సంతప్తసర్వేంద్రియః = తాపమునొందిన శరీరభాగములు గలవాడునై, చంద్ర వసంత మాల్య రచనా గాన్ధర్వ గంధాదిభిః = చంద్రుడు, వసంతుడు, పుష్పమాలలూ, గానములు, గంధాదుల చేత, రమ్యైః = వమ్యములైన, ప్రముఖాగతైః = ప్రముఖముగ వచ్చినవైన, యైః ఏవ = వేటి చేత, సః = అతడు, రమతే = రమించెనో, తైః ఏవ = వాటి చేతనే, సన్తప్యతే = బాధింపబడుచున్నాడు.

తాత్పర్యము: మిక్కిలి నిద్రలేమిచేత ఎఱుపెక్కిన కనులు గలవాడై, ఉషఃకాల చంద్రుని వంటి మోముకలవాడై, రమ్యములైన చంద్ర, వసంత, గీతగాన, పుష్పమాలాగంధాదులచేత రమించిన కర్ణీపుత్రుడు వాటి చేతనే బాధింపబడుచున్నాడు. శార్దూలవృత్తము.

– అట్లు కాక దేవసేన వలన ఈ తాపము కలిగెనా, అందునాశ్చర్యము లేదు. ఎందువలనన – ఆ సుదతి శ్లాఘ్యమైన మన్మథ మనోరథము కల శరీరము గలది. ఆమె రూపయౌవనలావణ్యములు కర్ణీపుత్రునకు ఉన్మాదము కలిగించుటకు అర్హములైనవి. ఆమె యొక్క –
విభ్రాన్తేక్షణం = చంచలమైన కనులు, అక్షతోష్ఠరుచకం = ఇతరస్పర్శనెరుగక సువర్ణముద్ర నలంకరించున్న పెదవులు, ప్రాచీనగణ్డం ముఖం = చెక్కిలిని ఉద్యోతించు ముఖము, ప్రత్యగ్ర ఉత్పతిత స్తనాంకుర మురః = ఎత్తయిన స్తనములయందుకురించిన చూచుకములు, కోమలీ బాహూలతాః = కోమలమైన బాహులతలు, అవ్యక్త ఉత్థిత రోమరేఖం ఉదరం = ఉదరమున కనీకనిపించక ఏర్పడిన రోమరేఖ, కుతోప్యాగతా శ్రోణీ = ఎచటి (లేని చోటు – శూన్యము – నడుము)నుండియో వచ్చిన నితంబము, భావశ్చ అనిభృత స్వభావ మధురః = పక్వమైన భావములు లేని స్వభావసుందర, నామ = రూపము, కం = ఎవరిని, న ఉన్మాదయేత్ = ఉద్విగ్నము చేయదు?

---

తాత్పర్యము: చంచలేక్షణ, పరస్పర్యయెఱుగని సువర్ణముద్రాలంకృతాధరములు, చెక్కిలిని చూపించు ముఖము, పీనస్తనములయందంకురించిన చూచుకములు, కోమలమైన బాహులతాద్వయి, ఉదరమున నవ్యక్తముగ వెడలిన రోమరేఖ, విరిసీ విరియని మానసికావస్థయందుండిన ఆ సహజసుందరి, ఎవరిని ఉద్విగ్నముగావింపదు?

*విశేషములు: (శార్దూల వృత్తము – మ స జ స త త గ – సూర్యాశ్వైర్మసజస్తతాస్సగురవః శార్దూల విక్రీడితమ్|| అని సూత్రము. సూర్య అంటే ద్వాదశాదిత్యులు, అశ్వ అంటే సప్తాశ్వాలు. అందువలన 12 అక్షరాలకు, 7 అక్షరాలకు యతి)*

*ఓష్ఠరుచకం: దీనినే అధరరుచకం అని కొందరు కవులు వర్ణించారు. రుచకం – అంటే నిష్కము. గుప్తులకాలం నాటి సువర్ణ నాణెములను నిష్కము/రుచకములంటారు. పెదవి క్రింది భాగాన, ఈ సువర్ణవర్ణపు ముద్ర రూపంలో అలంకరించుకొనుట నాటి స్త్రీల యలంకరణలో భాగము.*

*ప్రాచీనగణ్డం ముఖం = తరుణయువతి, తనముఖమును చూపక, విలాసముగ ప్రక్కకు తిరిగి మాటలాడుటవలన చెక్కిలి వివరముగ కన్పడును. ఈ విలాసమును చమత్కరించుచున్నాడు.*

*పై రెండు విషయములకై ఈ క్రింది అజంతా చిత్రసుందరిని చూడుడు.*



[పరిక్రమ్య]

స ఇదానీం దేవసేనాసముత్థం మదనామయమతివ్యాయామకృతజ్వరముద్దిశ్య హారతాళవృన్తచన్దనోపనీయమానదాహప్రతీకారః తత్సమాగమాశాకృతప్రాణధారణం శయనపరాయణః కథఞ్చిత్ వర్తతే | అద్య తు ప్రాగహరేవ పుష్పాఞ్జలికో నామ దేవదత్తాయాః పరిచారకః సోపచారముపగమ్య కర్ణీపుత్రముక్తవాన్ –

ఆర్యపుత్ర, విజ్ఞాపయత్యజ్జుకా దేవదత్తా 'న ఖలు మే హ్యస్తనేఽహన్యనాగమనాద్ బహుమానమధ్యస్థతాముపగన్తుమర్హత్యార్యపుత్రః | ఇయం హి మే భగినికా చణ్డాలికా కిమపి అస్వస్థరూపా తదనుకమ్పయా పర్యుషితాఽస్మి| ఇయం తు సమ్ప్రతమాగచ్ఛామీతి |తతస్తదుక్తదత్తప్రతివచనః ప్రతిపస్థాప్య పుష్పాఞ్జలికం కర్ణీపుత్రః సోపగ్రహమివ మాముక్తవాన్ – 'సఖే శశ, త్వయాఽపి నామ శ్రుతం 'సామ్ప్రతమిహాగచ్ఛామి' ఇతి | తదేష ఇదానీమవసరః సుఖప్రశ్నాగమనేన వివిక్తవిస్రమ్భం దేవసేనామవగాహ్య సన్తాపకారణమస్యాః పరిజ్ఞాతుమ్ | తదేషోఽఞ్జలిః | సర్వోపాయైరర్హతి దేవానాంప్రియోఽస్మాకం దేవసేనాసముత్థం హృదయగతమాపుంఖనిఖాతం మదనశరశల్యం సముద్ధర్తుమ్' ఇతి | తతః సస్మితానుయాత్రముక్తో మయా 'భవతు ధూర్తాచార్య, కిమితి త్వయా దివా దీపప్రజ్వాలనం క్రియతే | కిం నాభిజ్ఞోఽహం యువయోరన్యోన్యమనోరథమూకదూతకానాం నయనసంగతకానామ్ | అపి చ, స ఏవాస్మి మూలదేవసఖః శశోఽహమ్ నైనామప్రతార్యాగమిష్యామి' ఇత్యుక్త్వా ప్రస్థితోఽస్మి ! తత్ కిం ను రాజమార్గే సుహృత్ప్రశ్నసఙ్కథాభిః కాలం క్షపయతా తథా గన్తవ్యమ్ యథా దేవదత్తావిరహితాం చణ్డాలికామాసాదయేయమ్

---

(ముందుకు నడచి)
అతడు ఇప్పుడు దేవసేన వలన కలిగిన మదనవ్యాధిని సయించుటవలన హారములు, తాళవృంతపు గాళులు, చందనము గాగల తాపోపశమముల ధరించి కేవలమామెసమాగమునకై ప్రాణములను నిలుపుకుని శయనాగతుడై ఎలాగుననో యున్నవాడు.

ఈ రోజు మధ్యాహ్నమునకు ముందుగ ప్రాంజలికుడను దేవదత్త పరిచారకుడు ఉపచారసహితముగ వచ్చి కర్ణీపుత్రునికి చెప్పెను – ఆర్యపుత్ర, దేవి దేవదత్త విజ్ఞాపనమిది ' రేపు నేను రాకపోయిన ఆర్యపుత్రుడు నాకై సమాదరభావమున ఉపేక్షించుట సరికాదు. నా చెల్లెలు చాండాలిక (దేవసేన) కొంత అస్వస్థత నొందినది. ఆమెను చూచుకొనుటకై ఆగితిని. త్వరలో వచ్చెదను'

అతనికి ప్రతివచనమిచ్చి పంపి కర్ణీసుతుడు ప్రీతిపూర్వకముగ నాకిట్లనెను – 'సఖుడా! శశ! నేను వచ్చెదనని దేవదత్త చెప్పినమాట వింటివికదా. ఈ అవసరమును పురస్కరించుకుని కుశలప్రశ్న మిషచేత జ్వరపీడిత దేవసేన యొక్క సంతాపకారణమును తెలుసుకొనుము. ఇదే నా యంజలి. దేవసేన ప్రయోగించిన, నా హృదయమున లోతుగ నాటుకున్న ఈ కామబాణమును పెరికివేయుటకు నీవే సమర్థుడవు'. అంతట చిఱునగవుతో నేనంటిని – "కానిమ్ము ధూర్తాచార్యుడా. పగలే దీపమును వెలిగించుట ఎందుకు? మీ ఇద్దరి వీక్షణప్రసారముల మనోరథ మూక వర్తమానముల నెఱుఁగనా యేమి? ఇంక, నేను మూలదేవుని సఖుడను శశుడను. ఈ విషయమును తేల్చక తిరిగిరాను" యని చెప్పి బయలుదేరితిని. అందువలన రాజమార్గమున మిత్రులతో ముచ్చటలాడుచూ సమయము గడుపుచూ, దేవదత్త లేని సమయమున దేవసేనను చేరి పలుకరించెద.

(పరిక్రమ్య)

అహో తు ఖలు వసుంధరావధూ జంబూద్వీప వదనకపోలపత్రలేఖాయా నానాభాణ్డసమృద్ధయా అవన్తిసున్దర్యా ఉజ్జయిన్యాః పరా శ్రీః | ఇహ హి –

పుణ్యాస్తావద్ వేదాభ్యాసా ద్విరదరథతురగనినదా ధనుర్గుణనిఃస్వనా
దృశ్యం శ్రావ్యం విద్ధద్వాదాశ్చతురుదధిసముదయఫలైః కృతా విపణిక్రియా |
గీతం వాద్యం ద్యూతం హాస్యం క్వచిదపి చ విటజనకథాః క్వచిత్సకలా కలాః
క్రీడా పక్షిక్షుబ్ధాశ్చేమాః ప్రచురకరవలయరశనాస్వనా గృహపఙ్క్తయః ||

---

(ముందుకు నడచి)

అహో, భూదేవి యను వధువునకు వదనమైన జంబూద్వీపమునకు చెక్కిలి పత్రలేఖకు సమానమైన అవంతిసుందరి యనెడు ఉజ్జయినీ నగరపు అపూర్వశోభ, అనేకానేక భాండాగములతో సమృద్ధమై ఒప్పుచున్నది. ఇక్కడే –

తావత్ = ఎల్లెడల, పుణ్యాః = పుణ్యములైన, వేదాభ్యాసాః = వేదాభ్యాసములూ, ద్విరదరథతురగనినదాః = యేనుగుల, రథతురగములనినదములు, ధనుః = ధనువు యొక్క, గుణి = అల్లెత్రాటి, నిఃస్వనా = చప్పుళ్ళు, దృశ్యం = నాటక, శ్రావ్యం = కావ్య, విద్వద్వాదాః = పండితుల చర్చలు, చతుః = నాలుగు, ఉదధి = సముద్రములందు, సముదయఫలైః = ఉదయించిన ఫలములచేత, కృతాః = చేయబడినవి, విపణిక్రియాః = అంగడిసరుకులు, (రత్నమాలలిత్యాదులు) గీతం = గీతమునూ, వాద్యము = వాద్యమునూ, ద్యూతం = పణ్యములు, హాస్యం = హాస్యమును, క్వచిదపి = ఒకచో, విటజనకథాః = రంకుమొగుళ్ళకథలు, క్వచిత్ = ఒకచో, సకలాః కళాః = సకలమునైన కళలు, క్రీడాః = ఆటలు, ప్రచుర కరవలయః అశనా స్వనాః = (పంజరముల చుట్టు) కమ్మిన చేతుల చప్పుళ్ళ, పక్షిక్షుబ్ధాశ్చేమాః = పక్షుల (పెంపుడు చిలుకల) రవములు కల, గృహపంక్తయః = ఇళ్ళవరుసలు.

తాత్పర్యము: ఇక్కడే కదా పుణ్యవేదాభ్యాసములు, గజ,రథతురగనినాదాలు, అల్లెత్రాటి చప్పుళ్ళూ, కావ్యనాటక పండితచర్చలూ, నాలుగు సముద్రములనుండి సేకరించిన రత్నములతో చేసిన మాలలను విక్రయించు విపణులూ, ఒకచోట విటులకథలూ, ఒకచోట ఇతరకళలూ, గాజులగలగలలచేతులను కలకలరావాల పక్షులున్న పంజరముల ప్రక్కన యాడించుచున్న అంగనలు గల ఇళ్ళవరుసలూ..

*విశేషములు: నగరవర్ణన. స్వభావోక్తి అలంకారం. నైషధీయచరితమున విదర్భరాజధాని సుదీర్ఘ వర్ణన కు సంక్షిప్తీకరణ వలె నున్నది.*

(పరిక్రమ్య) అపీదానీమభిమతకార్యనిష్పత్తిసూచకం కిఞ్చిన్నిమిత్తం పశ్యేయమ్ | (విలోక్య)

అయం తావత్ కావ్యవ్యసనీ కాత్యాయనగోత్రః శరద్వతీపుత్రః సారస్వతభద్రః స్వగృహద్వారకోష్ఠకే శ్వేతవర్ణవ్యగ్రాగ్రహస్తః చిన్తితోపస్థితాస్వాదితాకారాక్షిభ్రూవికారైరభినయన్నివ చక్రపీడకక్రీడామనుభవతి | తత్కామమస్మిన్ కాలే ప్రవృత్తప్రతిభాస్రోతోవిఘాతినం సుప్రియమపి సుహృదమభ్యసూయన్తే కవయః | కిన్తు సరస్వతీలతాప్రభావానాం వాక్పుష్పకాణాం కర్ణపూరమ్ అకృత్వాऽతిక్రమితుం వఞ్చితమివాత్మానం మన్యే | యావదేనాముపసర్పామి | (ఉపేత్య)

సఖే కాత్యాయన కిమిదమాకాశరోమన్థనం క్రియతే | కిం బ్రవీషి – "స ఏవ మా కావ్యపిశాచో వాహయతి" ఇతి | మా తావత్ భోః అంధో పురాణకావ్యపదచ్ఛేదగ్రథనచర్మకార కిమిదం నష్టగోయూథ ఇవ గోపాలకో నవపదాన్యన్వేష్యసే | అథ సఖే కిం వస్తు పరిగృహ్య కృతః శ్లోకః | కిం బ్రవీషి – "నను ఖలు ఇమమేవ వర్తమానరమణీయం వసన్తసమయమాశ్రిత్య కృతః శ్లోకః" ఇతి | అథ శక్యం శ్రోతుమ్ ? కిం బ్రవీషి – "నన్వేష భిత్తిగతో వాచ్యతామ్" ఇతి. కాసౌ? (విలోక్య) అయే అయం –

---

(ముందుకు నడచి)

మనోభీష్టము పూర్తి అగుటకై ఎవడైన సుగుణవంతుని చూచెదను.

(పరికించి)

ఇతడే కదా కావ్యవ్యసని, కాత్యాయనగోత్రీకుడు శారద్వతీపుత్రుడు అయిన సారస్వతభద్రుడు! తన ఇంటి తలుపు ముంగిలిని ఉంగరమున అంటుకున్న మసితో, చింతను భ్రూవిక్షేప, ఆకారాదుల చేత అభినయించుచూ, చక్రపీడ అను విరహవేదనను అనుభవించుచున్నాడు. ఇట్టి సమయమున బయల్వడు ప్రతిభాధార ను తునకలు చేయుటకై నా ప్రియమిత్రుని మీదనూ కవిగణము వెడలును. కానీ సరస్వతీలతకు పూచిన వాక్కుసుమములను చెవికి ఆభరణముగా చేయకుండా, ముందుకు నడుచుట నన్ను నేను మోసగించుకొనుటయే అనుకొందును. అందువల్లనితనిని సమీపింతును. (సమీపించి) సఖుడా కాత్యాయన! ఏల ఇలా ఆకాశమును నెమరువేయుచున్నావు? ఏమంటావూ – "అదే, నాకు కావ్యపిశాచమను గాలి వీయుచున్నది" అనియా? ప్రాచీన కావ్యాలలో ముక్కలు సేకరించి కుట్టుకునే చర్మకారుడా, ఇప్పుడిలా గోవులకాపరి కోల్పోయిన గోవులమందలా కొత్తపదాలను వెతుక్కుంటున్నావా? ఇప్పుడు సఖుడా, ఏ వస్తువును గ్రహించి శ్లోకము రచించితివోయి? ఏమంటావూ – "ఇది ప్రస్తుతము నడుచుచున్న రమణీయమైన వసంతకాలమును వర్ణించు శ్లోకము" అని. నేను దానిని వినగలనా? ఏమంటావు – అలా కాదు, పైన గోడమీదనున్నది చదువుకో"మనియా? అదేమిటి? (చూచి) అయే, అది –

*(చక్రవాక పక్షులకు (జక్కవములు) విరహవేదన – చక్రపీడ అనునది కవిసమయము. ఈ పక్షులు రాముని విరహవేదనను పరిహసించగా, రాముడా పక్షులకు శాపమొసగెనని పురాణగాథ.)*

పుష్పస్పష్టాట్టహాసః సమదమధుకరః కోకిలావావదూకః
శ్రీమత్స్వేదావతారః ప్రసుభగపవనః కర్కశోద్దామకామః |
బాలామప్యప్రగల్భాం వరతనుమవశాం కామినో సమ్ప్రదాతుం
కాలోఽయం తత్కరిష్యత్యనునయనిపుణం యన్న దూతీసహస్రమ్ ||

సాధు భోః కల్యాణం ఖల్వేతన్నిమిత్తమ్ | వయస్య, సత్పుత్ర లాభ ఇవ యసస్కరః శ్లోకోఽయమస్తు | వాక్పురోభాగానామభాగీ భవ | అయే కేనైతద్ హసితమ్ ? (విలోక్య) అయే దర్దరకః పీటమర్దోఽప్యత్ర | అహో! దర్దరక, కిమత్ర హాస్యస్థానమ్ ? కిం బ్రవీషి – "ఇదం ఖలు భవతా సముద్రాభ్యుక్షణం క్రియతే యద్ వాగీశ్వరం వాగ్భిరర్చయసి" ఇతి | మా తావదలోకజ్ఞ కిం వసన్తమాసో న పుష్పోపహారమర్హతి? అపి చ న త్వయా శ్రుతపూర్వమ్ –

---

పుష్పస్పష్టాట్టహాసః = కుసుమముల స్పష్టమైన అతిశయహాసము, సమదమధుకరః = మత్తభ్రమరము, కోకిలావావదూకః = కోయిలల కుహూరవమూ, శ్రీమత్ స్వేదావతారః = చిరుచెమటలు, (*శ్రీమత్ విశేషణము – ఆ చెమట సురతము వలన కలిగినదని చమత్కారమైన సూచన*), ప్రసుభగపవనః = మిక్కిలి సుభగమైన గాళులు, కర్కశోద్దామకామః = కర్కశుడు, ప్రచండుడైన కాముడు, అప్రగల్భాం = ఎక్కువ మాటలాడని, బాలాం అపి = ముగ్ధను, వరతనుం = అందమైన శరీరముగలదానిని, అవశాం = కన్యను, కామినే = కామించినవానికి, సంప్రదాతుం = కట్టబెట్టు, యత్ = ఏ పని, అనునయనిపుణాం = నిపుణముగ మాటలాడగల, ద్యూతీసహస్రం = వేలదూతికలను, న కరిష్యతి = చేయలేదో, తత్ = అట్టి, కాలః అయం = కాలమిది.

తాత్పర్యము: కుసుమాట్టహాసములు, మత్తభృంగములు, కోవెలల కూజితములు, సురతమువలన కలిగిన చిరుచెమటలు, పరిమళభరితమైన మారుతములు కలిగి కర్కశమదనునిచేత వేయి నిపుణదూతికల మాటల చేతనైన లొంగని ముగ్ధను కన్యను కామికి కట్టబెట్టు అందమైన కాలమిది. *(స్రగ్ధరా – మ ర భ న య య య)*

భళా! ఈ నిమిత్తమై నీకు కల్యాణమగుగాక! సత్పుత్రలాభము వలె ఈ శ్లోకము యశస్కరమగుగాక! వాగ్దోషములు లేని కవివగుదువు గాక! అయే, ఎందుకీ మందహాసము? (చూచి) ఆహా, దర్దరకుడను పీటమర్దుడు కూడా వచ్చియున్నాడు. ఓ దర్దరకా, ఇక్కడ హాస్యప్రసక్తి ఏమున్నది? ...ఏమంటివి? – "వాగీశ్వరుడైన కవిని వాక్కులతో నర్చించుట, సముద్రమున మంచినీరు చల్లినట్లుందనియా" – అలా కాదు. వసంతమాసాన్ని పుష్పహారాలతో పూజించమా ఏమి? ఇది నీవు విని ఉంటావు –

*(వాక్పురోభాగానామభాగీ భవ అని విటుడు సారస్వతభద్రకవికి ఇచ్చిన ఆశీర్వాదము. పురోభాగతా అంటే దోషైకదృక్కు. ఇది ఒక తిట్టు. వాక్కులలో పురోభాగములకు అభాగివి కమ్ము – అంటే తిట్టులకు నోచుకోకుందువు కాక అని అర్థం. ఇది వ్యంగ్యంగా 'అవిధవా భవ' అన్న ఆశీర్వాదం లా అన్నట్టు అనిపిస్తుంది.*

*పీటమర్దుదంటే నాయకుని యొక్క విచక్షణుడైన సహాయకపాత్ర. ఉదాహరణ: రామాయణంలో సుగ్రీవుడు.*)

సూర్యం యజన్తి దీపైః
సముద్రమద్భిర్వసన్తమపి పుష్పైః |
అర్చామో భగవన్తం
వయమపి వాగీశ్వరం వాగ్భిః ||

ఇతి | భవతు, దంశితస్తే పీటమర్దస్వభావః | సేవితోఽత్రభవాన్ | అపి చ వసన్తకాలోఽయమచ్ఛలః పరభృతప్రలాపానామ్ | ఈదృశా ఏవాస్తు భవాన్ | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య విలోక్య) అయే అయమపరో విపులామాత్యః కామదత్తాప్రాకృతకావ్యప్రతిష్ఠానభూతః వైశికవృత్త్యాఽధోముఖః ప్రస్థితః | ఆ, గృహీతమ్ – ఏష దేవదత్తాసౌభాగ్యసంక్రాన్తే మూలదేవే విపులావమానాత్ ఆత్మానమవధీరితమవగచ్ఛన్ ప్రణయకృద్ధః ఖల్వేష ధాన్త్రః | భవతు పరిహాసప్లవేనైనమవగాహిష్యే | (నిర్దిశ్య) భోః సుహృత్ కుముదాననవబోధయన్ దివాచంద్రలీలయాఽతిక్రామసి | పృచ్ఛామస్తావత్ కిఞ్చిత్ |

---

దీపైః = దీపములచేత, సూర్యం = సూర్యుని, అద్భిః = నీటిచేత, సముద్రం = సముద్రమును, పుష్పైః = కుసుమముల చేత, వసంతం = వసంతకాలమును, అపి = కూడా, యజన్తి = పూజింతుము, వయమపి = మేమునూ, భగవంతం వాగీశ్వరం = మేమునూ మహాకవిని, వాగ్భిః = వాక్కులచేత అర్చామః = అర్చింతుము.

తాత్పర్యము: దీపములతో సూర్యుని,నీటితో సముద్రమును, పూలతో వసంతుని పూజించినట్లే మహాకవిని మేము వాక్కులతో అర్చింతుము. కానిమ్ము. నీ పీటమర్దుని స్వభావము చూపుకున్నావు. నీవిక్కడ సేవలు పొందుము. ఇంకా ఈ వసంతకాలంలో గండుకోయిలల గానములకు కొదవలేదు. నీవిట ఇలా ఉండుము. నేను వెడలుచున్నాను.

(ముందుకు నడచి, పరికించి)

అరే, ఈయన కామదత్తా అన్న ప్రాకృతకావ్యమును నిర్మించిన విపులామాత్యుడు. వేషము చూడగా తలవంచుకుని నడుచుచున్నాడు. ఆ తెలిసినది – మూలదేవ, దేవదత్తల విషయంలో తల దూర్చిన విపులావమానము వలన తను కూడా అవమానింపబడినట్లు భావించి ఈ మహానుభావుడు కుపితుడైనాడు.   కానిమ్ము, పరిహాసప్లవనములతో ఈతనిని సమీపింతును. (సైగ చేసి) ఓ సహృదయా! పగటిచంద్రుడు కలువలను ముడుచుకునేలా చేసినట్టు నన్ను దాటి వెళ్ళుచున్నావు? కొంచెం నిన్ను అడుగుతాను.

*(విశేషములు: కామదత్తా ప్రాకృత కావ్య ప్రతిష్ఠానభూతః అని విపులామాత్యునికి విశేషణం చెపుతున్నాడు. ప్రాతిష్ఠానమంటే – ఏదో ప్రభుత్వోద్యోగమట. అమాత్య శబ్దం కూడా ఈయన ప్రభుత్వాధికారాన్ని సూచిస్తుంది.  కామదత్తా – అన్న ప్రాకృతకావ్యమును శూద్రకుడు రచించి ఉంటాడని ఒకరిద్దరు ఇండాలజిస్టులు 'తెలివి'గా ఊహించారు. ఇంకా – విపులావమానము అంటే విపులా అన్న అమ్మాయి మూలదేవునికి, దేవదత్తకు మధ్య అదివరకు జరిగిన కథలో తలదూర్చి అవమానం పొందిన కథ. కాదంబరి కావ్యంలో బాణభట్టు చేసిన కర్ణీపుత్రుని ప్రస్తావనలో విపులా అన్న ప్రస్తావన వస్తుంది.మున్నుడి)*

కలావిజ్ఞానసంపన్నా గర్వైకవ్రతశాలినీ |
న ఖల్వత్యన్తధీరా సా ఖిన్నా తే విపులా మతిః ||

కిం బ్రవీషి – "గృహీతో వఞ్చితకస్యార్థః | కిం తవాచార్యో మూలదేవో న జ్ఞాయత" ఇతి | మా మైవమ్ |
దేవదత్తాసురతసంక్రాన్తస్యాపి విపులాగతమేవ హృదయమ్ | కిం బ్రవీషి – "తదపి మూలదేవీయం శాఠ్యమ్" ఇతి | ఆమ్, భవాన్
ఖలు సత్యార్జవః కిమిదానీం స్వశిష్యాం విపులాం నోపలభతే యయా ప్రణయకోపార్థమధిగతః కర్ణీపుత్రః –

ప్రాప్త ఇవ శరత్కాలః ప్రావృట్కలుషాం నదీం ప్రసాదయితుమ్ |
క్షిప్తః కదర్థయిత్వా హేమన్తే తాలవృన్త ఇవ ||

---

కళావిజ్ఞానసంపన్నా = కళలయొక్క విశేషజ్ఞానముచేత సంపన్నమైనది, గర్వైకవ్రతశాలినీ = గర్వమునే దీక్షగాకలిగినది, అత్యన్తధీరా = గంభీరమైనది, తే = నీయొక్క, సా విపులా మతిః = ఆ విపులమైన బుద్ధి, (విపుల అనే స్త్రీ హితమునందు శ్రద్ధవహించిన బుద్ధి)న ఖిన్నా ఖలు = ఖిన్నము కాలేదు కదా!

తాత్పర్యము: కళావిజ్ఞానసంపన్నమైనది, గర్వమే వ్రతముగ గలిగినది, గంభీరమైనది ఐన నీ విపులమైన మతి దుఃఖమునొందలేదు కదా.
*విశేషము: అనుష్టుప్పు. శ్లోకే షష్ఠం గురుజ్ఞేయం సర్వత్ర లఘుపంచమమ్ /*
*ద్విచతుష్పాదయోః హ్రస్వం సప్తమం దీర్ఘమన్యయోః //*
*(నాలుగు పాదములు. అన్ని పాదాలలో ఐదవ అక్షరం లఘువు, ఆరవ అక్షరం – గురువు. రెండు, నాలుగు పాదాలలో ఏడవ అక్షరం లఘువు. ఒకటి, మూడు పాదాల్లోనేమో ఏదవ అక్షరం గురువు కావాలి)*

ఏమంటావు – "వ్యంగ్యమర్థమైనది. నీ గురువు మూలదేవుడు తెలుసుకోలేదా" అనియా? – అలా కాదు. దేవదత్తతో శృంగారముల దేలియాడిననూ యాతని హృదయము విపులాగతమే అయినది. ఏమంటావు – అది కూడా మూలదేవుని మోసమే" అనియా. అవును. మీరే సత్యసంధులు. మీ శిష్యురాలు విపులనే పొందరాదా? ఆమె ప్రణయకోపాన్ని కర్ణీపుత్రుడు అనుసరించినట్టుగా?

ప్రావృట్కలుషాం = వర్షాలతో కలుషితమైన, నదీం = నదిని, ప్రసాదయితుం = తేటపర్చుటకు, శరత్కాలః ఇవ = శరత్కాలము వలె ప్రాప్తః = వచ్చినది. హేమన్తే = హేమంతమున, తాళవృంత ఇవ = తాడిచెట్టులా, కదర్థయిత్వా = నీటిని మలినపరచుచూ, క్షిప్తః = తోయబడినది.

తాత్పర్యము: వర్షాకాలంలో వరదనీటిని శరత్తు తేటపరుస్తుంది. ఆ తేటవర్చిన నీటిలో హేమంతములో తాడిచెట్టు నీటిని మలినపరచుచూ(కాయలను) విదల్చుతుంది. (అలా నీవు ఆమెను ఓదార్చుము). ఆర్యా.

కిం బ్రవీషి – "కదా కథమ్" ఇతి | సఖే శ్రూయతామ్ | నను కతిపయాహమివాద్య మద్ద్వితీయః కర్ణీపుత్రో విపులామనునేతుమభిగతః | అథ ద్వారకోష్టకస్థేనానేన క్రోధాగాధపరీక్షార్థమహమాదితః సోపగ్రహం కల్పితః | సోఽహం ప్రియవచనోపన్యాసేనాభిగతశ్చైనామ్ | సాఽపి చేర్ష్యాదోషదూషితలావణ్యా దృష్ట్వైవ మాం 'కుతోఽయమాయాస' ఇత్యుక్త్వా పరాఙ్ముఖీ సంవృత్తా | తతః సపరిహాసముక్తా మయా –

కిముక్తా కేన త్వం ప్రతివచ ఇదం కస్య వచసః
తదావృత్తా భూత్వా వద వదనచంద్రేణ వనితే |
ప్రసన్నాం త్వాం దృష్ట్వా భవతి హి మమ ప్రీతిరతులా
భుజఙ్గీవ కృద్ధా భ్రుకుటిరియముద్వేజయతి మామ్ || ఇతి

తదనన్తరమవన్తిసుందర్యా సఖ్యాఽభిహితా —

---

ఏమంటావు – "ఎలా అది?" అనియా? విను మిత్రుడా. కొన్ని రోజుల ముందులా ఈ రోజూ కర్ణీసుతుడు నాతోబాటు విపులననునయించుటకు నామె వద్దకు వచ్చెను. ఆమె ఇంటి వాకిలి ముందు విపుల కోపతీవ్రతను తెలుసుకోవటానికి నన్ను ముందుగా పంపెను. నేను మధురభాషణాలతో ఆమె వద్దకు వెళ్ళితిని. ఆమె కూడా ఈర్ష్యాదోష దూషిత లావణ్యాలచేత నన్ను ' ఎందుకింత శ్రమ' అని పలికి ముఖం తిప్పుకున్నది. అప్పుడు నేను పరిహాసపూర్వకంగా ఇలా అంటిని –

వనితే = యువతీ, త్వం = నీవు, కిముక్తా = ఏమంటివి? ఇదం ప్రతివచః = ఈ ప్రతివచనము, కేన = ఎందుకు?, కస్య వచసా = ఎవని మాటలచేత, తదావృత్తా భూతా = ఆవరింపబడితివి? వదనచంద్రేణ = ముఖచంద్రునితో, వద = పలుకుము. ప్రసన్నాం = కోపము లేని దానివైన, త్వాం = నిన్ను దృష్ట్వా = చూచి, మమ ప్రీతిః = నా అనురాగము, అతులా భవతి హి = ఎక్కువగును కదా. భుజంగీవ = సర్పము వలె (భుజంగీ అంటే వేశ్య అని మరొక అర్థం. ఇక్కడ శ్లేష) కృద్ధా = కుపితయై, ఇయం భృకుటిః = ముడిచిన కనుబొమలు గదిగా, మాం= నన్ను, ఉద్వేజయతి = ఉద్వేగపర్చుచున్నావు.

తాత్పర్యము: వనితా, ఏమంటివి? ఎందుకీ మాట? ఎవనిమాటలకు ఈ జవాబు? చంద్రబింబము వంటి ముఖమును తిప్పుకొనక బదులు చెప్పుము. ప్రసన్నవైన నిను చూచి నా అనురాగము ఎక్కువగును. కనుబొమలు మడిచి, కోపించి, సర్పం లా నన్ను ఉద్వేగపరుస్తున్నావు.

*విశేషములు: స్వభావోక్తి అలంకారం. భుజంగీ అన్న ప్రయోగం అర్థశ్లేష. శిఖరిణీ. (పాదమునకు పదిహేడక్షరములు. య మ న స భ లఘువు గురువు. రసైః రుద్రైశ్ఛిన్నా యమనసభలా గః శిఖరిణీ || 6, 11 యతి)*

తదనంతరము ఆమె సఖి అవంతిసుందరి ఇలా చెప్పింది —

కిం కృత్వా భృకుటీతరఙ్గవిషమం రోషోపరక్తం ముఖం
నిఃశ్వాసజ్వరితాధరం ప్రియసఖం ప్రాప్తం న సంభాషసే |
సౌభాగ్యేన హి శత్రుకర్మ కురుషే స్త్రీగర్వమేధావిని
మానం మానిని ముఞ్చ సర్వమచిరాదత్యాయతం ఛిద్యతే || ఇతి

అథ గుణవతీ పరిషదితి కృత్వా కర్ణీపుత్రోఽభిగతః | స చానయా పణిపాతావనతః సరోషమవధూయాభిహతః –

కృత్వా విగ్రహమాగతోఽసి నియతం నిర్వాసితో వా తయా
కాన్తాలాపవినోదనే కిల వయం విశ్రామభూమిస్తవ |
కిం నైరాశ్యనిరుత్సుకస్య మనసః సంధుక్షణైర్మే పునః
ప్రీతేనాత్ర కిమౌషధేన కటునా సుస్వాగతం గమ్యతామ్ || ఇతి |

---

భృకుటీతరంగవిషమం = నొసటి వెక్కిరింత తో విషమమై, రోషోపరక్తం ముఖం = రోషము చేత ముఖమును ఎర్రగా, నిఃశ్వాసజ్వరితాధరం = నిట్టూర్పులతో పెదవి కాగునట్లు, కృత్వా = చేసి, ప్రాప్తం ప్రియసఖం = వచ్చిన ప్రియమిత్రుని, కిం న సంభావసే = ఎందుకు మర్యాదచేయవు?, స్త్రీగర్వమేధావిని = యువతీగర్వమనే మేధను కలిగినదానా, సౌభాగ్యేన హి = నీ ఈ సౌభాగ్యము చేతనే, శత్రుకర్మ = శత్రుత్వమును, కురుషే = చేయుచున్నావు. మానిని = మానవంతురాల, మానం = అభిమానమును, ముఞ్చ = విడువుము, అవిచారాత్ = మాగా ఆలోచింపక, ఆయతం = లాగబడినది, సర్వం = ఏదైనా, ఛిద్యతే= తెగుతుంది.

తాత్పర్యము: నొసటి వెక్కిరింతతో విషమమై, రోషంతో ఎర్రనైన ముఖమును, నిట్టూర్పులతో పెదవిని కాగనిస్తూ, వచ్చిన మిత్రుని సంభావింపకనున్నావు. గర్వమునే మేధస్సు అనుకొను యువతీ, ఈ విధముగా చేసి శత్రుత్వముమొనర్చుచున్నావు. మానినీ, అభిమానము విడుము. ఆలోచింపక, కడదాకా లాగిన విషయము తెగుతుంది.

*విశేషములు: ఖండిత అను శృంగారనాయిక లక్షణము. (శార్దూల వృత్తము – మ స జ స త త గ)*

అప్పుడు ఎదురుగా మాటలాడి సామరస్యముగా తేల్చుటకై కర్ణీపుత్రుడు అక్కడికి వచ్చెను. తలదించుకుని ఉన్న అతనితో నామె రోషముగనిట్లనెను.

నియతం = ఖచ్చితముగ, తయా = ఆమెచేత, నిర్వాసితః = గెంటింపబడి, వా = లేక, విగ్రహం కృత్వా = పోట్లాడి, ఆగతః అసి = వచ్చినాడవు. వయం = మేము, తవ = నీయొక్క, కాన్తాలాపవినోదినే = స్త్రీవిషయవినోదవిషయమునను, విశ్రామభూమిః = విశ్రాన్తి ప్రదేశమును, కిల = అట! నైరాశ్యనిరుత్సుకస్య = నైరాశ్యనిరుత్సాహకమైన, మే = నాయొక్క, మనసః=

కిం బ్రవీషి – "యద్యేవం తామేవావినీతాం తావదేనాముపాలబ్ధుం గచ్ఛామి" ఇతి | ఛన్దతః తథా గృహీతవాక్యో భవానస్తు | సాధయామస్తావత్ |

(పరిక్రమ్య)

హా ధిక్ అపరం మూర్తిమత్ గమనవిఘ్నముపస్థితమ్ | ఏష హి పాణిని పూర్వకో దన్దశూకపుత్రో దత్తకలశిర్నామ వైయాకరణః ప్రతిముఖమేవోపస్థితోఽస్మాన్ | అపీదానీమవిఘ్నేనాస్య వాగ్వాగురాముత్తరేయమ్ | సంరబ్ధమివైనం పశ్యామి | ఆమ్ వాద విఘట్టితేనానేన భవితవ్యమ్ | తథా హి| అస్య కలహకణ్డూబంధురా వాగీషదపి స్పృష్టా దేవకులఘణ్టేవానుస్వనతి |

---

మనస్సునకు, పునః = మరల, సంధుక్షితైః = రగిలింపబడుట, కిమ్ = ఎందుకు? అత్ర = ఇక్కడ, ప్రీతేన = ప్రీతిగా, కటునా ఔషధేన = కటువైనమందువలన, కిమ్ = ఎందుకు? (ప్రయోజనమేమి?), సుస్వాగతం = సుఖముగా వచ్చినారు, గమ్యతామ్ = వెళ్ళుదురు గాక!

తాత్పర్యము: ఖచ్చితముగా ఆమెచేత (దేవదత్త చేత?) గెంటించుకుని పోట్లాడి ఇక్కడికి వచ్చినాడవు. మేము నీ స్త్రీవినోదవిషయకము, విశ్రామభూమియునూ యన్నమాట! ఇదివరకే నిరాశా నిస్పృహలతోనున్న నా మనసు తిరిగి రగుల్చుట ఎందుకు? ప్రీతిగా కటువైన మందు త్రాపించుట ఏ యవసరమున? ఎలా వచ్చినారో అలా తిరిగి పొందు.

ఏమంటివి – " సరే, నీవట్లనిన ఆమెనే పొందుటకు వెళ్ళుచున్నాను" అనియా. మనసు విప్పి ఆమె తో మాట్లాడుము.. ముందుకేగెదము గాక.

(ముందుకు నడచి)

హా ధిక్! మా బాటలో ఇంకొక వ్యక్తి రూపమైన విఘ్నము వచ్చెను. నా ముందు నిలచిన ఇతడే దందశూకపుత్రుడైన పాణినిదత్తకలశుడను వైయాకరణుడు. ఇప్పుడితనికి బెదదలేకుండగ చక్కగ బదులీయవలెను. గాభరాగా పోవుచున్నటున్నాడు. ఆ, దిట్టతనముగ మాటలాడునితనితో నిదివరకు యనుభవమే. అలాగేను. కలహప్రియుడైన ఈతనిని కదిపిన మందిరమున ఘంటలవలె మాటలు వినబడును.

ప్రియగణికశ్చైషా ధాన్త్రః | తాం కిల నూపురసేనాయా దుహితరం రశనావతికాం నామ వ్యపదిశతి | భోః కష్టమ్ | కరభకణ్ఠావసక్తం వల్లకీమివ శోచామి తాం రశనావతికామ్ | ఏష ఉద్యామ్యాగ్రహస్తమభిభాషత ఏవాస్మాన్ |

కిమాహ భవాన్ – అపి సుఖమశయిష్టాః" ఇతి | కా గతిః, భవతు సమాజయిష్యామ్యేనామ్ | స్వాగతమక్షరకోష్ఠాగారాయ | వయస్య దత్తకలశో సంరబ్ధమివ త్వాం పశ్యామి | కచ్చిత్ కుశలమ్ | కిం భవానాహ – "ఏషోऽస్మి బలిభుగ్భిరివ సంఘాతవలిభిః కాతన్త్రికైరవస్కన్దితః " ఇతి | హన్త ప్రవృత్తం కాకోలుకమ్ | సఖే దిష్ట్యా త్వామలూనపక్షం పశ్యామి" ఇతి | యథాతథాऽస్తు భవతః | సాధయామ్యహమ్ |

కిం బ్రవీషి – "క్వ సంచిచీర్షుః, తిష్ట తావత్, కిమసి దుద్రుష్టః"ఇతి |

---

ఈ చపలుడు గణికాప్రియుడునూ. నూపురసేన కూతురయిన రశనావతి తన ప్రియురాలని చెప్పుచుండును.ఆహ్, కష్టము. ఊహిస్తే, ఇతనికి ఆ రశనావతి ఒంటె మెడకు వేలాడుతున్న వీణలా అనిపిస్తుంది. ఈతడు చేయెత్తి చూపుతూ అంటున్నాడు –

*(కరభకంఠావసక్తం – కరభం అంటే ఒంటె అని ఒక అర్థం. చిటికెనవ్రేలి చివర క్రింది భాగపు అరచేతిని కూడా కరభం అంటారు. ఆ ప్రాంతాన్ని స్త్రీ ఊరువులతో ఉపమించడం కావ్యాలలో కద్దు. కరభోపమోరు – భట్టనారాయణుని వేణీసంహారం, ద్వితీయాంకం. ఇక్కడ కరభకంఠావసక్తం అంటే – కరభకంఠం చివర వేలాడుతున్న వీణ – ఒంటె మెడ చివరన వేలాడు వీణ. వైయాకరణులను, శాస్త్రాధ్యయనపరులను జడులుగా పేర్కొనడం కొన్ని నాటకాదులలో జరిగింది. ఇక్కడ అదే ధోరణి.)*

ఎమనుచున్నారు మీరు – 'సుఖముగ నిద్ర జరిగినదా?" అనియా? ఇక తప్పేదేముంది, ఇతనితో కొంత లోకాభిరామాయణం జరుపుతాను. – అక్షరకోశాగారాధిపతికి స్వాగతము. కలశము చేతబట్టుకుని గాభరాగ నున్నట్టున్నారు. పర్వాలేదు. కుశలమే. ఏమన్నారు – 'బలి అన్నం (లేదా పిండము) తినే కాకిలా కాతంత్రవ్యాకరణం నా నెత్తిపై పడింది' అనియా? హా, కాకోలుకం అయిందీ. మిత్రమా, సంతోషం. నిన్ను ముసుగేదీ లేకుండా చూస్తున్నాను. ఏమన్నావు – " ఏమిది నా కాతంత్రవైయాకరణులకు కాతంత్రములో వినోద"మనియా. నువ్వెలా అంటివో అలానే. ముందుకేగుచున్నాను.

*(కాతంత్ర వ్యాకరణం : గుప్తుల కాలంలో ప్రాచుర్యంలో ఉన్న వ్యాకరణ శాస్త్రం. ఈ వ్యాకరణానికి కుమారస్వామి కర్త అని ఐతిహ్యం..నాడు పాణిని వ్యాకరణానికి, కాతంత్ర వ్యాకరణానికి మధ్య గొడవలు నడిచేవిట. కాకోలుకం అయింది – ఇక్కడ ఆ వైయాకరణిని గుడ్లగూబతో పోలుస్తున్నాడు.)*

ఏమంటివి – " ఎక్కడ వెళ్ళాలని ముచ్చటపడుతున్నావూ? ఆగిక్కడ. ఉరకలు పరుగులెందుకు?" అనియా.

హా ధిక్, ప్రసీదతు భవాన్ | నార్హస్యస్మాన్ ఏవంవిధైః కాష్ఠప్రహారనిష్ఠురైర్వాగశనిభిరభిహన్తుమ్ | సాధు, వ్యావహారికయా వాచా వద | అభాజనం హి వయమీదృశానాం కరభోద్గారదుర్భగానాం శ్రోత్రవిషనిషేకభూతానాం వైయాకరణవాగ్వ్యవసానామ్ | కిం బ్రవీషి – "కథమహమిదానీమనేకవావదూకవాదివృషభవిఘట్టనోపార్జితానామ్ అనేకధాతుశతఘ్నీం వాచముత్సృజ్య స్త్రీశరీరమివ మాధుర్యకోమలాం కరిష్యామి" | అహో, అనాథః ఖల్వసి | కుతః –

స్వైరాలాపే స్త్రీవయస్యోఽపచారే
కార్యారంభే లోకవాదాశ్రయే చ |
కం సంశ్లేషః కష్టశబ్దాక్షరాణాం
పుష్పాపీడే కణ్ఠకానాం యథైవ ||

---

హా ధిక్, కరుణింతురు గాక. ఇలా నన్ను గట్టి కర్రదెబ్బలతో, పిడుగుపాటువంటి వాక్కులతో చావుదెబ్బకొట్టడం మీకు యుక్తం కాదు. సులభమైన వ్యావహారికమైన మాటలలో చెప్పండి. ఈ విధమైన భరించలేని ఒంటె త్రేపులవంటి సుదీర్ఘసమాసాల చేత, చెవికి సూదిపోటులవంటివాటిచేత, వైయాకరణుల వాగ్వ్యసనవ్యాపారాలచేత హింసించకండి. ఏమంటున్నారు – "ఎలా ఇప్పుడు నేను అనేకవాదనల వాదముల వృషభ పదఘట్టనలతో సంపాదించిన శబ్దములను, ధాతుశతఘ్నులను, కూడిన మాటలను వదిలి తరుణితనువు లాంటి కోమలమాధుర్యమంగా వాక్యములు కూర్చగలను?" – అహో, మీరు తప్పక అనాథలు. ఎందుకంటే –

*(ధాతుశతఘ్నులు – శతఘ్ని – అంటే నూరు మందిని లేదా అనేకమందిని ఒకే సారి చంపగల ఆయుధం. మందుగుండి దట్టించి ఫిరంగి పేల్చటం ఈ కావ్యకాలానికి బహుశ ఉండదు. అయితే అలాంటిదేదో మరొక ఆయుధం నాడు ఉండాలి.)*

స్వైరాలాపే = స్వేచ్ఛగా ఆడు మాటలలో, స్త్రీ వయస్య ఉపచారే = మిత్రుడు మరియు, స్త్రీలతో ఉన్నప్పుడు, కార్యారంభే = పనులు మొదలెట్టడంలో, లోకవాదాశ్రయే చ = లోక, న్యాయవ్యవహారాలలో, కష్టశబ్దాక్షరాణాం = కఠినమైన శబ్దాక్షరాల యొక్క, సంశ్లేషః = కూడిక, కః = ఎక్కడ? యథా = ఎట్లు, పుష్పాపీడే = పూలను గుచ్చడంలో, కంటకానాం ఇవ = ముళ్ళ వలె.

తాత్పర్యము: ముచ్చటలాడేప్పుడు, మిత్రుడు మరియు ప్రియురాళ్ళతో కలిసి ఉన్నప్పుడు, ముఖ్యమైన పనుల్లో, బయట పనులప్పుడూ, న్యాయవ్యవహారాల్లో, కష్టపడి కటువైన మాటలతో మాట్లాడ్డం ఎందుకు? పూలను గుచ్చి మాలచేసేప్పుడు ముళ్ళు అడ్డువచ్చినట్టుగాను?

*విశేషములు: పుష్పాపీడే కంటకానాం యథా – ఉపమాలంకారం. (వారిజాక్షులందు వైవాహికములందు...గుర్తుకు రావటం లేదూ). కార్యారంభే – గుప్తుల కాలంలో కార్యము అన్న శబ్దాన్ని న్యాయవ్యవహారాల్లో విశేషార్థంలో ఉపయోగించేవారుట. న్యాయం కోసం అర్జీ పెట్టుకోవడం కార్యారంభం. శాలినీవృత్తము.శాలిన్యుక్తా మ్తౌ త గౌ గోబ్ధి లోకైః (మ త త గగ) 4, 7 యతిస్థానాలు.*

కిమాహ భవాన్ – "స్థానే ఖలు సా పుంశ్చలీ శబ్దశీఘరమాభాషితా రుష్టా" ఇతి | తత్కేయం పుంశ్చలీతి ? కిం బ్రవీషి – "ప్రియా నామ కేనోచ్యతే" ఇతి (విమృశ్య) ఆ విదితమ్ రశనావతికా ఏతచ్ఛార్హతి | నాతశ్చ భూయః కష్టతరం యత్సా ప్రచురపాదపాంతరచారిణీవ కోకిలా స్వభావఖరం బిల్వపాదమాశ్రితా | కష్టం భోః మహదిదం పరిహాసవస్తు, ఆస్వాదయిష్యామస్తావత్ |

వయస్య దత్తకలశే, ఏవం స్వభావదక్షిణస్య భవతః కథం కామినీ విరక్తేతి పరం మే కుతూహలం శ్రోతుమ్ | ఏతదుచ్యతాం తావత్ విస్తరతః | కిమాహ భవాన్ – "సాధు సా పుంశ్చలీ పూర్వేద్యుః పర్వకాలే వేశకోష్ఠకముపేత్య రిరంసయా మాం హవిర్హుహూషన్తం జిఘృక్షతీవోపాసీదత్ | తతోऽహమేనామవోచమ్ – వృషలి హవిర్జుహూషన్తం మా మా స్ప్రాక్షీః " ఇతి | హన్త! ఇదం తత్ దుష్టగాన్ధర్వం నామ | సుకుమారః ఖలు కామినీసంపరిగ్రహః | కలహోऽయముపచారో ను | మా తావదలోకజ్ఞ యుక్తం నామ త్వయా ప్రణయోపగతాం కామినీం విరాగయితుమ్ | స్త్రీజనోऽపి త్వయా కష్టశబ్దనిష్ఠురాభిర్వ్యాకరణ విస్ఫులింగాభిర్వాగ్భిరుత్త్రాసయితవ్యో భవతి | ఇదమపి న త్వయా శ్రుతపూర్వమ్ –

రత్యర్థినీం రహసి యః సుకుమారచిత్తాం కాన్తాం స్వభావమధురాక్షరలాలనీయమ్ |
వాగర్చిషాం స్పృశతి కర్ణవిరేచనేన రక్తాం స వాదయతి వల్లకిముల్ముకేన ||

---

ఏమంటిరి మీరు – " నా మధురమైన పలుకులకు లొంగని యది ఖచ్చితంగా రంకులాడి" అనియా? ఎవరా రంకులాడి? ఏమంటిరి – "ప్రియురాళ్ళ గురించి ఎవరు చెప్పుదుర" నియా? (ఆలోచించి) ఆ, తెలిసినది. రశనావతికా మీ మాటకు తగినది. ఎందుకంటే, తను ఎల్లప్పుడూ చరించుటకు అందమైన చెట్లనాశ్రయించిన ఆ కోకిల స్వభావవిరుద్ధంగా, కష్టతరముగ మారేడు చెట్టునాశ్రయించినది. కష్టమైన ఈ విషయం కూడా పరిహాసవస్తువయింది. సరే, దీనిని ఆస్వాదింతును. మిత్రమా, దత్తకలశా, మీ వంటి కరుణాస్వభావుని పట్ల ఆ కామిని ఎందుకు విరక్తురాలయింది అని వినడానికి ఆసక్తికరముగా నున్నది. విశదంగా చెప్పుము. "ఆ రంకులాడి నిన్న పొద్దున చక్కగా ముస్తాబై, అగ్నికార్యంలో ఉన్న నన్ను సమీపించింది. నేనా రంకుటాలిని – 'అగ్నికార్యంలో ఉన్న నన్ను తాకకు' అన్నాను" అన్నారా? ధిక్. కార్యం చెడడమంటే అదే. కామినులను సొంతం చేసుకోవడం సున్నితమైన విషయం కదా. ప్రణయోపగతులైన కామినులను విరాగులుగ చేయుట మీ యలోకజ్ఞతకు ఋజువు. నిష్ఠురమైన మాటలతో, వ్యాకరణవిస్ఫులింగాల మాటలతో అమ్మాయిలు అలసిపోగలరు. ఇది మీరు విని ఉండకపోవచ్చు.

యః = ఎవడు, సుకుమారచిత్తాం = మార్దవమైన హృదయం గలదానిని, రత్యర్థినీం = రమింపగోరుదానిని, స్వభావమధురాక్షరలాలనీయాం = స్వభావసుందమైన వాక్కులతో లాలించవలసిన దానిని, కాన్తాం = సుందరిని, రహసి = ఏకాంతమున, కర్ణవిరేచనేన = చెవి పగిలే, వాగర్చిషా = వాక్కులతో, స్పృశతి = స్పర్శించునో, సః = అతడు, రక్తాం వల్లకీం = రాగాలు పలికించు వీణను, ఉల్ముకేన = మండుతున్న కట్టెతో, వాదయతి = మీటుచున్నవాడు.

తాత్పర్యము: ఎవడు మృదుహృదయ అయి రమింపగోరుదానిని, స్వభావమధురముగ లాలించవలసిన తరుణిని ఏకాంతములో చెవి పగిలే మాటలతో పలుకరించునో, వాడు రాగయుక్తమైన వీణను మండుతున్న కట్టెతో మీటుతున్నవాడు.

సర్వథా దుష్కరకారిణీ ఖలు రశనావతికా, యా భక్తమనేన కల్పయతి | అథవా తు తస్యాః శాపః | వయస్య దత్తకలశే శ్రుతం శ్రోత్రరసాయనమ్ | స్వస్తి భవతే | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య)

ఇదమపరం మనుష్యకాన్తారముపస్థితమ్ | ఏష హి ధర్మాసనికపుత్రః పవిత్రకో నామ ప్రచ్ఛనపుంశ్చలకో అచౌక్షః చౌక్షవాదితః రాజమార్గేఽవిదితజనసంస్పర్శే పరిహరన్నివ సంగృహీతాౘ్రవసనః సంకుచిత సర్వాంగో నాసికాద్వయమంగుళీద్వయేన పిధాయ చత్వరశివపీఠికామాశ్రిత్యస్థితః | హాస్యః ఖల్వేష తపస్వీ | యథా తావదయం మత్తకాశిన్యా దుహితరం వారుణికాం నామ బంధకీమనురక్త ఇతి శ్రూయతే | తదిదానీం కిమయమాకులే భవతి | ఇదమస్యా వినయప్రచారపుస్తకముద్ఘాట్యతే |

---

*విశేషములు: విషమాలంకారము. వసంతతిలకం – త భ జ జ గ గ.      రక్తా – వీణ తరపున రాగములొలికించునది అని తరుణి తరపున అనురక్త అయినదని ఊహించనగును.*

ఎప్పుడూ కష్టము కలిగించేదే కదా ఈ రశనావతిక, ఇటు వంటి వాడితో స్నేహం చేస్తూంది. లేక, అది ఆమె విషయమున శాపమేమో. మిత్రమా, దత్తకలశా, మీ శ్రోత్రరసాయనమును వింటిని. శుభమగుగాక. నేను ముందుకేగుచున్నాను.

(ముందుకు నడిచి)

ఇది మరొక జనారణ్యము. ఇక్కడ ఉన్నది ధర్మాసనికపుత్రుడైన పవిత్రకుడనే గుట్టుగా రంకుపనులు చేసెడువాడు. అశుద్ధుడైనా శుద్ధుడని చెప్పుకొను వాడు. రాజమార్గములో తెలిసిన వాళ్ళనుండి తప్పుకుందుకు తడిబట్టలను కట్టుకుని, శరీరభాగాలన్నిటిని ముదుచుకుని, రెండు వ్రేళ్ళతో ముక్కును మూసుకుని, కూడలి దగ్గర శివపీఠికదగ్గర నిలబడి ఉన్నాడు.

*(అచౌక్షః చౌక్షవారితః – దీని పాఠాంతరము*
*అచోక్షః చోక్షవాదితః. – చౌక్ష, చోక్ష శబ్దాలకి పవిత్రుడని అర్థమట. ఇది భాగవత వైష్ణవసాంప్రదాయవిశేషమని, అభినవగుప్తుని నాట్యశాస్త్రవ్యాఖ్యానము అభినవభారతి యందు*

*చోక్షా భాగవతవిశేషా యే ఏకాయనా ఇతి ప్రసిద్ధాః /*

*అని నిర్దేశింపబడినది.)*

ఈ తాపసుని చూసి నవ్వు వచ్చుచున్నది. మత్తకాశిని కూతురైన వారుణిక అనే ఒక రంకులాడిపై ఆశతో ఉన్నాడని విన్నాను. మరి ఇప్పుడిలా గాభరా పడుతున్నట్టుగా ఉన్నాడు. ఈతని వినయప్రచారపుస్తకాన్ని తెరిచి చూస్తాను.

అహో పవిత్రక, కిమిదముష్ణస్థలీకూర్మలీలయా స్థీయతే | కిం బ్రవీషి – "రాజమార్గే సులభమవిదితజనసంస్పర్శం పరిహరామి" ఇతి | అఘో, అవిజ్ఞాతజనసంస్పర్శో నామ పరిహ్రియతే భవతా | వారుణీజఘనపాత్రం జాహ్నవీ తీర్థమివ పరమపవిత్రం నను | కిం బ్రవీషి – "నైతదస్తి" ఇతి | కిమిదం గోపాలకులే తక్రవిక్రయః క్రియతే |

కితవేష్వపి నామ కైతవమారభ్యతే | కిం బ్రవీషి – "సాధు మర్షయతు భవాన్ నిపుణః ఖలు తే చారః " ఇతి | కస్య చారః ? కుతశ్చారః ? న సూర్యో దీపేనాంధకారం ప్రవిశతి | నహి మే చారకృత్యమస్తి | సహస్రచక్షుషో హి వయమీదృశేషు ప్రయోజనేషు | తదపనయ శఠప్రచారకంచుకమ్ | ఆకృతిమాత్రభద్రకో భవాన్ మిథ్యాచారవినీతోఽస్యసి | అఘో సజ్జనసబ్రహ్మచారిన్ విటపారశవ. చౌక్షపిశాచో వేశ్యాప్రసంగశ్చేతి ఆచారవిరుద్ధమేతత్ విరుద్ధాశనమివ మాం ప్రతిభాతి | అపి చ చౌక్షోపచారయంత్రితః తాముపగృహ్ణన్ సందంశేన నవమాలికామపచినోషి | కిం బ్రవీషి – "సర్వథా నివృత్తోఽస్మి విభ్రమాత్" ఇతి | పాయసోపవాసమివ క ఏతత్ శ్రధాస్యతి | కిం బ్రవీషి – యద్యేవం సుప్రసన్నోఽసి శిష్యత్వే నిష్పాదయతు మా భవాన్" ఇతి | దిష్ట్యా భవాన్ సత్పథమారూఢః | యది చ విటత్వే కృతో నిశ్చయః శీఘ్రమేవ వేశయువతిప్రణయపరిఘభూతమిథ్యాచారకంచుకముద్ఘాట్యతామ్ | ఘుష్యతాం విటశబ్దః | కిమాహ భవాన్ – "ప్రణతోఽస్మి" ఇతి | హన్తేఽదానీం దత్తః ప్రదేయకః స్వైరమయన్త్రితశ్చాచారః | అయమిదానీమాశీర్వాదః –

---

అహో పవిత్రక. ఈ ఎండలో ఇసుకపైన తాబేలులా నిలబడ్డావు? ఏమంటావు – "రాజమార్గంలో తెలిసిన వాళ్ళనుండి తప్పుకుందుకు" అనియా? అహో, పవిత్రజనసంస్పర్శను పరిహరిస్తున్నట్టుంది నీ వాలకం. వారుణీజఘనపాత్రం గంగాతీరంలా పవిత్రం కాదోయి. ఏమంటావు – "అదేమీ లేద"నా? యాదవుల ఇళ్ళకు పాలమ్మటం ఏల?

*(ఉష్ణస్థలీకూర్మలీలా – తాబేలు తన శరీరాన్ని ఎండబెట్టుకుందుకు గట్టు మీద ఇసుకపైకి వచ్చి తన తలను, శరీరాంగాలను, లోపలికి, బయటకు జరుపుతూ వేడి పుట్టించుకుంటుందట. అలా ఈ బ్రాహ్మణుడు తన తువాలును ముడవడమూ, సాగతీయడమూ చేస్తున్నాడని ఎగతాళి)*

ధూర్తులతో ధూర్తత చూపటం వద్దు. ఏమంటావు – "చాలు బాబు, నీ చారత్వం గొప్పది. నన్నిలా వదిలేయి" అనియా? ఎవని చారత్వం? ఎక్కడి చారత్వం? సూర్యుడు దీపాన్నుంచుకుని చీకట్లోకి వెళ్ళడు. నాకు అలా వెనకల దారుల్లేవు. ఈ వ్యవహారాల్లో నేను వేయికళ్ళవాణ్ణి. నీ ధూర్తప్రచారం చేసే వేషాలు విడిచిపెట్టు. ఆకారం తో మటుకు నీవు పవిత్రమైన వాడివి. మిగతావన్నీ మిథ్యాచారాలే. అరే, సజ్జనసహాధ్యాయి విటుడా, శుద్ధత్వము, వేశ్యాప్రసంగమూ పరస్పరవిరుద్ధాలు.శుద్ధత్వాన్నితీసుకుని సందేశాలతో నవమాలిక కూరుస్తున్నావు. ఏమంటావు – "ఇవన్నీ వదిలేశానిప్పుడు" అనియా? పాయసోఽపవాసం వంటి ఈ విషయాన్ని ఎవడు విశ్వసిస్తాడు? ఏమంటావు – " ఈ విషయంలో కాస్త నా మీద దయతలిస్తే నన్ను మీ శిష్యునిగా చేసుకోండి" అనియా. ఆహా, సన్మార్గం లోకి వచ్చినందుకు శుభాకాంక్షలు. విటత్వం మీద నిశ్చయుడైతే త్వరగా వేశ్యలప్రణయానికి అడ్డంకి అయినా నీ మిథ్యాచారసహితమైన దుస్తులు వీడుము. విటత్వాన్ని ప్రేమించు. ఏమన్నావు – "నమస్కరిస్తున్నాను" అనియా? హా. ఇప్పుడు నీ విశృంఖలాచారమునిచ్చావుగా. ఇదిగో కొనుమాశీర్వాదము –

ఆక్షిప్తస్రస్తవస్త్రాం ప్రశిథిలరశనాం ముక్తనీవీం విహస్తాం
హస్తవ్యత్యాసగుప్తస్తనవివరవలీమధ్యనాభిప్రదేశామ్ |
లజ్జాలీనోపవిష్టాం నహి నహి విసృజేత్యేవమాక్రన్దమానాం
శయ్యామారోప్య కాన్తాం సురదసముదయస్యాగ్రసస్యం గృహాణ ||

కిం బ్రవీషి – "ఉపస్కారితం శ్రేయః, చికిత్సితోఽస్మి" ఇతి | యద్యేవమాచార్యదక్షిణేదానీమేష్టవ్యా | కిం బ్రవీషి – "నన్వయమంజలిః" ఇతి | భో నన్వయమతివ్యయః | భవతు | ఇదానీం నిష్పన్నశిష్యాః స్మో వయమ్ | భవానిదానీమాచార్యో న శిష్యః | సగర్వం స్వైరమయన్త్రితశ్చర | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య)

---

ఆక్షిప్తస్రస్తవస్త్రాం = తొలగించబడిన అస్తవ్యస్తమైన వస్త్రములు కలదానిని, ప్రశిథిల రశనాం = బాగా శిథిలమైన మొలనూలుకలిగినదానిని, ముక్తనీవీం =వీడిన పోకముడిదానిని, విహస్తాం = విడివడిన చేతులదానిని, హస్తవ్యత్యాస గుప్తస్తన వివర వలీమధ్య నాభిప్రదేశాం = కుడి స్తనముపై ఎడమయరచేతిని, ఎడమ స్తనముపై కుడు అరచేతిని కప్పుటవలన నడుమున గల ముడుతలను తెలియబర్చు దానిని, లజ్జాలీన ఉపవిష్టాం = సిగ్గరితనము చేత కూర్చున్నదియు యైన దానిని, నహి నహి విసృజతు ఇవ ఆక్రందమానాం = వద్దు, వదులుమని కేకలుపెట్టుదానిని, సురతసముదయస్యాం = కోరికపుట్టినయట్టిదానిని, కాన్తాం = సుందరిని, శయ్యామారోప్య = పానుపుపై జేర్చి, అగ్రసస్యం గృహాణ = మొదట యనుభవింపుము.

తాత్పర్యము: తొలగించబడిన అస్తవ్యస్తమైన వస్త్రములు కలదానిని, బాగా శిథిలమైన మొలనూలుకలిగినదానిని, వీడిన పోకముడిదానిని, విడివడిన చేతులదానిని, కుడి స్తనముపై ఎడమయరచేతిని, ఎడమ స్తనముపై కుడి యరచేతిని కప్పుటవలన నడుమున గల ముడుతల వివరములను తెలియబర్చు దానిని, సిగ్గరితనము చేత కూర్చున్నదియు యైన దానిని, వద్దు, వదులుమని కేకలుపెట్టుదానిని, కామము తనయందు జనించిన యట్టిదానిని, కాంతను,పానుపుపై జేర్చి, మొదట యనుభవింపుము.

*విశేషము: ఏకదేశవివర్తి రూపకము. స్రగ్ధరా,మ్రభ్నైర్యానాం త్రయేణ త్రిముని యతియుతా స్రగ్ధరా కీర్తితేయమ్||*
*మ ర భ న య య య అనే గణాలతో కూడుకొని ప్రతి ఏడు అక్షరాలకు యతి కలది స్రగ్ధరా వృత్తము*

ఏమంటున్నావు – "సహాయాన్ని గుర్తుంచుకుంటాను. చికిత్సుడనైతిని" అనియా. అలాగయితే ఆచార్యదక్షిణ తప్పక తీసుకోవాలి. ఏమంటివి – "ఇదిగోనిదే నమస్కారమ"నియా. ఇదేం ఖరీదైనది కాదు. కానిమ్ము. మేమిలా శిష్యులను సంపాదించుకొనే వారలమేలే. ఇప్పుడు నీవు గురువ్వే కానీ శిష్యుడివి కావు. స్వేచ్ఛగా గర్వంగా తిరుగు. ముందుకు నడచెదను.

(ముందుకు నడిచి)

హీ, హీ సాధు భో నానాకుసుమసమవాయసంపిండితేన వసన్తమధ్యాహ్నస్వేదావతారస్పర్శసుభగేన ప్రతిహరతి ఇవాహం మాల్యాపణప్రాసాదసంబంధవినిఃసృతేన విపణివాయునా నూనముపస్థితోऽస్మి | (పుష్పవీథీం విలోక్య) మూర్తిమతీవ ననాకుసుమసమవాయాంగప్రత్యంగా వసన్తవధూః | ఇయం హి –

పద్మోత్ఫుల్లశ్రీమద్వక్త్రా సితకుసుమముకుళదశనా నవోత్పలలోచనా
రక్తాశోకప్రస్పందోష్ఠీ భ్రమరరుతమధురకథితా వరస్తబకస్తనీ |
పుష్పపీడాలంకారాఢ్యా గ్రథితశుభకుసుమవసనా స్రగుజ్జ్వలమేఖలా
పుష్పన్యస్తం నారీరూపం వహతి ఖలు కుసుమవిపణిర్వసంతకుటుంబినీ ||

---

ఆహా, బాగు. అనేకానేక పుష్పాల సుగంధాల మిశ్రమంతో వసంతకాలమధ్యాహ్నపు చెమటలను శీతలంగా స్పర్శిస్తూ, మాలలు కడుతున్న అనేక దుకాణాల తాలూకు విపణివాయువులతో నిలబడి ఉన్నాను. (పూలవీధిని చూచి) వసంతవధువు కుసుమాలను అంగప్రత్యంగాలతో అలంకరించుకుని చూడముచ్చటగనున్నది. ఇదేను –

పద్మ ఉత్ఫుల్ల శ్రీమద్వక్త్రా = వికసించిన తామరవలె శోభనమైన ముఖముగలది, సిత కుసుమ ముకుళ దశనా = తెల్లటి మల్లెమొగ్గ వంటి దంతములది, నవ ఉత్పలలోచనా = ఉదయించిననల్లకవుల కనులది, రక్తాऽశోక ప్రస్పన్దోష్ఠీ = ఎర్రని అశోకపువ్వు వలె భాసించే ప్రశస్తమైన పెదవి కలది, భ్రమర రుత మధుర కథితా = తుమ్మెదల ఝుంకారాల మధురమైన కథలు కలది, వరస్తవక స్తనీ = చక్కనిపుష్పములగుచ్ఛము వంటి స్తనములు గలది, పుష్పాపీడాలంకారాఢ్యా = పూలతో గట్టిగా కట్టిన అలంకారాలు గలది, గ్రథితశుభకుసుమవసనా = వికసించిన శుభకుసుమాల వస్త్రాలు కలది, స్రగుజ్జ్వలమేఖలా = ప్రకాశించు పుష్పమాలావడ్డాణం కలది, వసంతకుటుంబినీ = వసంతమను కుటుంబమునకు చెందినది, కుసుమవిపణిః = పూలబజారు, పుష్పన్యస్తం నారీరూపం = పూలతో కప్పిన స్త్రీరూపమును, వహతి ఖలు = ధరించినది సుమా!

తాత్పర్యము: వికసితపద్మముఖి, కుందరదనా, కలువకన్నులది, రక్తాశోకము వంటి ఎర్రని పెదవులది. తుమ్మెదల ఝుంకారాలనే కథలు కలది, పూలగుచ్ఛముల స్తనములది, పూలతో గట్టిగా కట్టిన అలంకారాలు గలది, తెల్లని బట్టలుకట్టినది, వసంతకుటుంబమునకు చెందినదై ఈ పూలబజారు పూలతో కప్పిన స్త్రీరూపమును పొందినది సుమా!

*విశేషము: మాలా దీపకము. స్రగ్ధర. పూలబజారును, వసంతవధువునూ సమానముగ చమత్కరించుటచేత సమాసోక్తి అలంకారము.*

భోః సర్వథా నానాకుసుమసమవాయగంధహృతహృదయోఽయం దుష్కరం ఖలు కరోమి ఏనామతిక్రామన్ | (పరిక్రమ్య) ఇదమపరం పరిహాసపత్తనముపస్థితమ్ | ఏష హి మృదంగవాసులకో నామ పురాణనాటకవిటః "భావజరద్గవః" ఇతి గణికాజనోపపాదితద్వితీయనామధేయః సుకుమారగాయకస్య ఆర్యనాగదత్తస్యోదవసితాన్నిర్గచ్ఛతి | సుష్ఠు తావదనేన నీలీకర్మస్నానానులేపనపరిస్పందేన జరాకౌపీనప్రచ్ఛాదనమనుష్ఠితమ్ | సర్వసఖశ్చైష ధాన్త్రః | న శక్యమిమం అనభిభాష్యాతిక్రమితుమ్ | పరిహాసిష్యామ్యేనమ్ (నిర్దిశ్య)

భావజరద్గవ, అపి సుభిక్షమనయా జరసా | కిమాహ భవాన్ – "ఏషా భవతో నిర్వేదాత్ జరద్భుజంగ ఇవ జరత్వచముత్సృజామి" ఇతి | ప్రాణైః స పశ్యామః | పునర్యువేవ భావః | సిద్ధం హి తే మాయయా యౌవనకర్మ | తవ హి –

---

అంతటా వివిధములైన కుసుమాలసుగంధాలతో ఆవరింపబడిన హృదయుడనై ఇక్కడ నుండి కదులలేకున్నాను. (ముందుకు నడచి) మరొక పరిహాసాస్పదమైన పరిస్థితి ఎదురైనది.

ఈతడు మృదంగవాసులకుడు. అది వరకు నాటకాలలో విటుడు. వేశ్యల ద్వారా 'భావజరద్గవము' అనిపించుకున్నవాడు. ఆర్యనాగదత్తుడనే గాయకుని ఇంటి నుంచి బయలుదేరినాడు.ఈయన లేపనస్నానములు చేసి, చందనాలేపనాదులు చేసికొని, తన కౌపీనంతో ముసలితనాన్ని గోప్యము చేసి ఉన్నాడు. ఈతడు ఈతనికి చాలామంది స్నేహితులు. ఈతనిని పలుకరించకుండా వెళ్ళటం కుదరదు. ఈతడిని కాస్త వేళాకోళం చేస్తాను.

*(పురాణనాటకవిటుడు – సాభిప్రాయంగా చెప్పుట ఎందుకంటే, అదివరకు నాటకాల్లో విటుడు, ఇప్పుడు వృద్ధుడై కేవలం విటుడుగా మిగిలాడని ధ్వని. జరద్గవమంటే ముసలి ఎద్దు. భావజరద్గవము గొప్పభావములచేత పరిపుష్టమైన వాడని అర్థము. గౌరవార్థకమా, వ్యంగ్యమా అని తెలియదు. 'ధాన్త్రః' అనే శబ్దం ప్రాచీనమైనదిగా కనబడుతున్నది. అమరంలో ఈ శబ్దం కనబడటం లేదు. బహుశా వ్యంగ్యమైన పిలుపు అయి ఉంటుంది. లేదా 'Dude' అన్న అర్థంలోని మాట అయి ఉండవచ్చు.)*

(సైగ చేసి)

భావజరద్గవా, మీ ముసలితనము కుశలమా? ఏమంటిరి – "మీ నిర్దేశము వలన ముసలిపాము (కుబుసము విడుచుట) వలె ముసలితనమనే చర్మాన్ని విడచుచున్నాను" అనియా.

*(భుజంగమంటే పాము అని ఒక అర్థం, విటుడని మరొక అర్థం. అందుచేత ఇక్కడ అర్థ శ్లేష).*

మీ ప్రాణాలను పణంగాపెట్టి యౌవనాన్ని సాధిస్తున్నారన్నమాట. యువకులయిపోయినట్టే. మీకే –

రాగోత్పాదితయౌవనప్రతినిధిచ్ఛన్నవ్యలీకం శిరః
సందంశాపచితోత్తరోష్ఠపలితం నిర్ముండగండం ముఖమ్ |
యత్నేనారచితామృజగుణబలేఆనేన చాంగస్య తే
లేపేనేవ పురాణజర్జరగృహస్యాయోజితం యౌవనమ్ |

కిం బ్రవీషి – "మదనీయం ఖలు పురాణమధు" ఇతి | మనోరథ ఏష భావస్య | సర్వథా త్రిఫలగోక్షురలోహచూర్ణసమృద్ధిరస్తు భవతః | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య)

---

రాగోత్పాదితయౌవనప్రతినిధిః = రంగు పులుముట వలన కలిగిన యౌవనమునకు ప్రతినిధి వలె,ఛన్నవ్యలీకం శిరః = జుట్టు (ఆచ్ఛాదితమైన) కప్పబడిన తల,సందంశాపచిత = పట్టకారుచేత పట్టుకొన్నది వలె,ఉత్తరోష్టపలితం = పైపెదవి పైని నెరసిన,నిర్ముండగండం = మొక్కుకై యున్నట్టి రోమములను కలిగిన,ముఖం = వదనము,
యత్నేన ఆరచిత = ప్రయత్నము చేత చేయబడిన,అంగస్య లేపేన = మైపూతలతో, ఆమృజాగుణ బలేన = మరమ్మత్తు శక్తిచేత, ఇవ తే = వలే నీ యొక్క, నీ,పురాణజర్జర గృహస్య = పాతబడిన ఇంటికి,ఆయోజితం = కొని తేబడిన,యౌవనమ్ = యౌవనము (ఉన్నది)

తాత్పర్యము: ఓయీ, నీ శిరమున రంగు పూయుటవలన నకిలీ యౌవనమునకు ప్రతినిధి వలె నున్నది. మీసములు గడ్డములు, నెరసి, మొక్కుబడికై యున్నట్టున్నవి. మైపూతలచేత మరమ్మత్తు చేసిన శిథిలమైన పాత ఇంటికి కొనితెచ్చిన నూతనత్వము వలె నీ యవ్వనమున్నది.

*విశేషములు: శార్దూలవృత్తము (మ స జ స త త గ). ఆమృజా – నూనె పూత వలన. ఆమృజా గుణ బలము – ఖండస్ఫుటితసంస్కారమని మరొక పేరు.*

ఏమంటున్నారు – "పాతబడిన మధువుకు కైపెక్కువ" అనియా. పండితుల (మీ యొక్క) మనోరథమిది కాబోలు. ఎల్లప్పుడూ మీకు త్రిఫల గోక్షుర లోహచూర్ణ సమృద్ధి కలుగుగాక. నేనిక అతిక్రమింతును.

(ముందుకు నడచి)

*(త్రిఫలగోక్షురలోహచూర్ణము = వాజీకరణము. కామసంధాయకౌషధము)*

అయే, అయమిదానీం సహసోపస్థితే మయి ద్యూతసభాలిందతః శిలాస్థంభేనమాత్మానమావృత్య స్థితః | (విలోక్య) భవతు | విజ్ఞాతమ్ | శైషిలకోऽయమ్ | కిం ను ఖల్వస్యాస్మాద్దర్శనపరిహారేణ ప్రయోజనమ్ | కిం మాలతికాదూతిస్వయంగ్రహావినయ ఆత్మశంకాముత్పాదయతి | భవతు | పరిహాసప్లవనైనమవగాహిష్యే |

భో ద్విజకుమారక కిమిదమాత్మప్రచ్ఛాదనేన సుహృత్సమాగమః ఛత్రేణ చంద్రాతప ఇవ ప్రతిషిధ్యతే | ఏష నిఃసృత్య ప్రహసితః | కిం బ్రవీషి – "స్వాగతం సుహృత్కర్ణధారాయ" ఇతి | భద్ర కుతో మే సుహృత్కర్ణధారతా యోऽహం తస్మాద్ ద్వంద్వరతిప్రణయసాహసాత్ బహిష్కృతః | కిం బ్రవీషి – "నైతదస్తి" ఇతి | అపి సురతోంఛవృత్తే, మా మైవమ్ | ప్రకాశం ఖల్వేతత్ యథా శైషిలకస్య గృహే శాక్యభిక్షుకీ ప్రతివసతీతి | సా కిల త్వయి ఉత్పన్న కామయా మాలాకారదారికయా మాలతికయా త్వత్సకాశం దౌత్యేనానుప్రేషితా | తస్యాశ్చ త్వయా నిరుపస్కృతభద్రకం రూపయౌవనలావణ్యమామిషభూతముద్దిశ్య తదాత్వమేవావక్షితమ్, నాయాతికమ్ |

---

అరే, అతడిక్కడ నన్ను చూడగానే జూదగృహావరణలో శిలస్థంభం వెనక దాక్కున ఉన్నాడు. (చూచి) కానిమ్ము. తెలిసినది. ఇతడు శైషిలకుడు. నన్ను చూచి దాక్కునే అవసరం ఏమిటి? మాలతికా అనే దూతిని బలవంతంగా చేపట్టుట అనే విషయంపై శంకను కలిగిస్తున్నాడు. కానిమ్ము. పరిహాసగీతముతో అతనిని పలుకరిస్తాను.

*(స్వయంగ్రహము – భాగస్వామిని అంగీకారం లేకుండా పట్టుకొనుట.*
*సముత్షిపన్ యః పృథివీభృతాం వరం వరప్రదానస్య చకార శూలినః |*
*త్రసత్తుషారాద్రి సుతాససంభ్రమ స్వయంగ్రహాసుఖేన నిష్క్రయమ్ || (శిశుపాలవధమ్ – ౧ – ౫౦)*
*– రావణుడు కైలాసపర్వతమునకు పోయి దానిని పెళ్ళగించి ఈశ్వరుడిచ్చిన వరదానమునకు ప్రతిగా ఆయనకు 'పార్వతీకంఠగ్రహణము' కలిగించెను. పార్వతి భయంతో శివుని అనుమతి లేకయే శివుని మెడ కౌగిలించుకుంది అని అర్థం.*
*స్వయంగ్రహము – ప్రియప్రార్థనాం వినా కంఠగ్రహణం అని మల్లినాథసూరి వ్యాఖ్య.)*

ఓ ద్విజకుమార, ఏల నీ మిత్రుని చూడగానే గొడుగుతో చంద్రుని నీడనడ్డుకున్నట్టు పనికిరాని పని చేస్తున్నావు? ఇప్పుడు బయటపడి నవ్వుతున్నావు? ఏమంటావు – "మిత్రుల చెవికింపైన వానికి స్వాగత"మనియా.
*(సుహృత్కర్ణధారుడు = మిత్రుల చెవికింపైన వాడు. మిత్రుల పనులను చేసిపెట్టి సంతోషపర్చేవాడు)*

భద్రుడా, నీ ఇద్దరు పడతుల ప్రణయసాహసాలను దాచిపెట్టిన తర్వాత నాకు ఇంకెక్కడి చెవికింపు? "అదేమీ లేదు" అంటావా? కామాన్ని అడుక్కునే వాడా, నాకు అలా చెప్పకు. శైషిలకుని ఇంట బౌద్ధభిక్షుకి ఉంటోందని అందరికీ తెలుసు. కామభావంతో మాలిని, మాలతికను దూతగా నీ వద్దకు పంపించింది. ఆ దూత సాధారణరూపాన్ని (అలంకారాదులు లేని సహజరూపం) యౌవనాన్ని, లావణ్యమయమైన శరీరాన్ని చూచి లలూచీపడి ఆమెపై కన్ను వేశావు. భవిష్యత్తులో దొరకగలదానికోసం

ఆగలేకపోయావు.

కిం బ్రవీషి – 'సఖే యత్సత్యమనాగతసుఖాశయా ప్రత్యుపస్థితసుఖత్యాగో న పురుషార్థః | న దీపేనాగ్నిమార్గణం క్రియతే" ఇతి | భోః సుష్ఠు కృతమ్ | వంచితం ఖలు రహస్యం యదీదం న విస్తరతో బ్రూయాః| విస్తరత ఇదానీం శ్రోతవ్యమ్ | కిమాహ భవాన్ –"క ఇదానీమవినయప్రపంచమాత్మనః ప్రకాశయతి | కిన్తు సమాసతః శ్రూయతామ్ | తయా హి ప్రసభమాక్రాన్తయాఽభిహితోఽహమ్ –

సంపాతేనాతిభూమిం ప్రతరసి శఠ హే మాన్యాః ఖలు వయం
దౌత్యేనాభ్యాగతాయాః చపల న సదృశం యత్తే వ్యవసితమ్ |
కృచ్ఛాద్ రుద్ధాఽస్మి జాతా పరగృహవసతిం సంప్రాప్య విజనే
మా మైవం హా ప్రసీద ప్రియ విసృజ పురా కశ్చిత్ ప్రవిశతి ||

---

*(సురతోంఛవృత్తే – అంటే కామాన్ని అడుక్కునే వాడు. ఉంఛవృత్తి అంటే భిక్షుకవృత్తి. కేవలం రాలిపడిన ధాన్యాలను, చెట్టు విదల్చిన పళ్ళను ఏరుకుని తినేవాడని గౌరవార్థం)*

ఏమంటున్నావు – " మిత్రమా, భవిష్యత్తు లో దొరికే సుఖం కోసం, ఎదురుగనున్న సుఖాన్ని త్యాగం చేయటం పురుషార్థం కాదు. దీపంతో అగ్నిని వెతకరు" అనియా? ఓ, బాగా చేశావు. నువ్విలా వివరాలు చెప్పకపోయి ఉంటే రహస్యం తెలిసేది కాదు. ఈ కథ విశదంగా తెలుసుకోదగింది. ఏమంటావు – "ఎవ్వడూ తన ప్రలోభాలకు సంబంధించిన విషయాలను బహిర్గతం చేయడు. కానీ నీకై కాస్త చెబుతాను. తనతో ధాటిగా మాట్లాడ్డం విని ఆమె నాతో ఇలా సమాధానం చెప్పింది.

*(రేపటికోసం నేటిని త్యాగం చేయడం వ్యర్థం అన్న విషయానికి సంస్కృతంలో రెండు పాత సూత్రాలున్నాయి. వరం సాంశయికాత్ నిష్కాత్ అసాంశయికః కార్షాపణః – సందేహంతో వచ్చే నిష్కం కన్నా నిస్సందేహంగా దొరికే కార్షాపణం మేలు. నిష్కం – బంగారు నాణెం. కార్షాపణం – వెండి నాణెం.,వరమద్య కపోతః శ్వో మయూరాత్ – రేపటి నెమలికన్న నేటి పావురం మేలు)*

హే శఠ = ఓ ధూర్తుడా, సంపాతేన అతిభూమిం = విశ్వాసము చూరగొని, ప్రతరసి = మోసగిస్తున్నావు. వయం = మేము,మాన్యాః ఖలు = గౌరవింపదగినవారము కదా! చపల = చపలుడా, దౌత్యేన = దూతకారణమున, అభ్యాగతాయాః = వచ్చినదానిపై, సదృశం యత్ తే = ఇయ్యది, న వ్యవసితం = చేయరానిది, పరగృహ వసతిం = అన్యుల గృహమును, విజనే = ఒంటరితనమున, సంప్రాప్య = చేరి, కృచ్ఛాత్ = బాధ చేత, రుద్ధా జాతా అస్మి = ఆపబడిన దానను అయితిని, మామైవం = నన్నిలా చేయకుము హా, ప్రసీద = కరుణచూపుము, ప్రియ = ప్రియుడా, పురా = ముందు, విసృజ = వదలుము, కశ్చిత్ = ఎవరో, ప్రవిశతి = ప్రవేశించుచున్నారు.

తాత్పర్యము: నాపై విశ్వాసము జూపించి ఇప్పుడు మోసగించుచున్నావు. నేను గౌరవనీయురాలను కదా. దూతికగా వచ్చినదానిపై ఇయ్యది తగదు. అన్యగృహమునేకాంతమున జొచ్చిన దాన. నాపై కరుణజూపుము. వదలు..ఎవరో వచ్చుచున్నారు.

ఇతి | సాధు భో అమృదంగో నాటకాంకః సంవృత్తః | అనేన సురతసంధిచ్ఛేదేన స్థిరీకృతో వాసిస్ఠీపుత్రేన విటశబ్దః | వయస్య సుభగో భవ | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య) హన్త భోః సురతసర్వాతిథిసన్నివేశం వేశమనుప్రాప్తాః | యోऽయమ్ –

కామావేశః కైతవస్యోపదేశో
మాయాకోశో వంచనాసన్నివేశః |
నిర్ద్రవ్యాణామప్రసిద్ధప్రవేశో
రమ్యక్లేశః సుప్రవేశోऽస్తు వేశః ||

(పరిక్రమ్య) క ఏష మలినప్రావారావగుణ్ఠితశరీరః సంకుచితసర్వాంగో వేశ్యాంగణాత్ ద్రుతతరమభినిష్కామతి | అయే సంభ్రమాద్ భ్రష్టం కాషాయాన్తముపలక్ష్యే |

---

*విశేషములు: సంపాతేన అతిభూమిం – విశ్వాసమను భూమిపై దూరమునకు వచ్చి – ఇది నాటి కాలపు సామెతలా కనబడుతుంది.*

– అనియా? బాగు, మృదంగం లేకనే నాటకాంకము ముగిసింది.
సురతసంధి జరగడాన్ని ఆపి వాశిష్టీపుత్రుని విటశబ్దానికి సరైన అర్థం కల్పించావు. సరే భాగ్యవంతువు కమ్ము మిత్రమా. నేనిక ఏగుచున్నాను. (ముందుకు నడిచి) హా, శృంగారాభిలాషుల నగరవేషము (నగర వేశ్యావాటిక) వచ్చింది. ఈ వేషము –

కామావేశః = మదనునికి ఆటపట్టు, కైతవస్య ఉపదేశః = జూదములకు నెలవుపట్టు, మాయాకోశః = మాయల భండారము, వంచనసన్నివేశః = మోసాలదృశ్యము. నిర్ద్రవ్యాణాం = దరిద్రులకు, అప్రసిద్ధవేశీ = నెలవు కానిది, రమ్యక్లేశః = అందమైన వేదన గలది, వేశః = ఈ వాటిక, సుప్రవేశః = మంచి ప్రవేశము గలది, అస్తు = అగుగాక!

తాత్పర్యము: మదనినికాటపట్టు, తగవుల నెలవుపట్టు, మాయల పెట్టె, వంచనలకు దృశ్యభూతము, ధనహీనులకు చొరరానిది, అందమైన వేదన కలది అగిన ఈ వాటికలో మంచి ప్రవేశము జరుగుగాక.

*విశేషము: శాలినీవృత్తము. శాలిన్యుక్తా మ్తౌ త గౌ గోబ్ధిలోకైః అని శాలినీ వృత్తసూత్రము. అందమైన శకారాంత్యానుప్రాస. ఎనిమిది శకారాలు ఉపయోగించాడు. మృచ్ఛకటికంలో "ఏషా, నాణకమోషికామకశికా, మచ్ఛాశికా, లాశికా.." అన్న ప్రాకృతపద్యంలో ఇలాంటి శకారావృత్తిని రచించాడు శూద్రకమహాకవి.*

(ముందుకు నడచి) ముదురు ఎరుపు రంగు చీవరముతో శరీరాన్ని కప్పుకుని, శరీరభాగాలను ముడుచుకుని, తత్తరతో వేశ్యాంగన ఇంటినుంచి వస్తున్నదెవరు?

ఆ స ఏష ధర్మారణ్యనివాసీ సంఘిలకో నామ దుష్టశాక్యభిక్షుః | అహో సారిష్టతా బుద్ధశాసనస్య యదేవం విధైరపి వృథాముణ్డైరసద్భిక్షుభిరుపహన్యమానం ప్రత్యహమభిపూజ్యత ఏవ | అథవా నా వాయసోచ్ఛిష్టం తీర్థజలముపహతం భవతి | ఏష తిరస్కృత్యైవాత్మానం దృష్ట్వైవాస్మానభిప్రస్థితః | భవతు | మమ వాక్శరగోచరోక్షతో న యాస్యతి | అభిభాషిష్యే తావత్ | (నిర్దిశ్య) విహారవేతాళ క్వేదానీముహూక ఇవ దివాశంకితశ్చరసి | కిం బ్రవీషి – "సాంప్రతం విహారాదవగచ్ఛామి" ఇతి | భూతార్థం జానే విహారశీలతాం భదన్తస్య | ధాన్త్ర క్వేదానీం వేశవీథీదీర్ఘికాగతో బక ఇవ శంకితశ్చరసి | నను సురతపిణ్డపాతమనుష్ఠీయతే ? కిం బ్రవీషి – "మాతృవ్యాపత్తి దుఃఖితాం సంఘదాసికాం బుద్ధవచనైః పర్యవస్థాపయితుమాగతోఽస్మి" ఇతి | వినష్టం త్వన్ముఖాద్ బుద్ధవచనం మదభ్రమదివోపస్పర్శే పశ్యామః | భోః కష్టమ్ –

వేశ్యాంగణం ప్రవిష్టో మోహాద్ భిక్షుర్యదృచ్ఛయా వాఽపి |
న భ్రాజతే ప్రయుక్తో దత్తకసూత్రేష్వివోంకారః ||

---

అరే, తత్తరపాటుతో తొలగిన కాషాయవస్త్రధారిలా కనిపిస్తున్నాడు. (చీవరం – అంగీ జారిపోయిందని ఒక అర్థం. పవిత్రత భ్రష్టమైందని శ్లేష) హా, ఇతడే కదా ధర్మారణ్య(విహార)నివాసి అయిన సంఘిలకుడనే దుష్టబౌద్ధభిక్షువు. అహో, ఈ విధమైన వ్యర్థంగా ముండనం చేసుకున్న తప్పుడు భిక్షువుల పూజల కారణంగా బుద్ధబోధకు ఎంత అరిష్టం పట్టింది? కానీ, కాకుల ఎంగిలి వలన పుణ్యతీర్థానికి ఎంగిలి అంటదు. అతడు నన్ను చూచాడు. అందుకనే తనను తాను దాచిపెట్టుకుని పరిగెడుతున్నాడు. కానిమ్ము. నా వాగ్బాణాలతో గాయపడకుండా తప్పించుకోలేడు. అతడితో మాట్లాడతానిప్పుడు.(సైగ చేసి) ఓ విహారభేతాళ,ఎందుకిలా పగటి గుడ్లగూబలా వెళుతున్నావు? ఏమంటున్నావు – " ఇప్పుడే విహారం నుండీ వచ్చాను" అనియా. భదంతుని 'విహారశీలత' తాలూకు స్వచ్ఛత గురించి నాకు తెలుసు. మహాభాగా, ఎందుకిప్పుడు వేశ్యావీధి తాలూకు దిగుడుబావిలో దిగిన కొంగలా అనుమానంగా వెళుతున్నావు. ఓ, శృంగారభిక్షను అనుష్ఠించుచున్నావా? ఏమిటి – "మాతృమరణంతో దుఃఖిత అయిన సంఘదాసికను బుద్ధవచనాలతో సముదాయించడానికి వచ్చాను" అంటున్నావా? నీ ముఖం నుండీ వచ్చిన బుద్ధవచనం సారాయితో ఆచమనం చేసినట్టు లా అనిపిస్తుంది. హా, కష్టము.

మోహాత్ = వివశత్వముతో, వా = లేక, అపి అదృచ్ఛయా = కామముతోనైనా, వేశ్యాంగణం = వేశ్య ముంగిలిని, ప్రవిష్టః = ప్రవేశించినవాడు, దత్తకసూత్రేషు = కామసూత్రతంత్రములందు, ప్రయుక్తః = ఉపయోగించబడిన, ఓంకారః ఇవ = ఓంకారము వలె న భ్రాజతే = శోభింపడు.

తాత్పర్యము: మోహకారణాన లేదా కామకారణాన వేశ్య ఇంటిని చేరినవాడు, కామతంత్రవిషయాలలో ఉపయోగించిన ఓంకారంలా ప్రకాశించడు.

*విశేషాలు: మూడు నాలుగవ పాదాలలో ఉపమాలంకారం. మొత్తమంతటా కలిపి దృష్టాంతాలంకారం. దత్తకసూత్రము – దత్తకుడనే మధురకు చెందిన ఆచార్యుడు పాటలీపుత్రములోని వేశ్యలకోసం సూత్రగ్రంథము వ్రాసెను. ఇది కామశాస్త్రమున ఆరవ తంత్రము అని చెప్పబడుచున్నది.*

కిం బ్రవీషి – "మర్షయతు భవాన్ నను సర్వసత్త్వేషు ప్రసన్నచిత్తేన భవితవ్యమ్" ఇతి | స్థానే నిత్యప్రసన్నో భదన్తః తృష్ణాచ్ఛేదేన పరినిర్వాణమవాప్స్యసి | ఏషోంజలిప్రగ్రహం కరోతి | కిం బ్రవీషి – "సాధు ముచ్యేహమ్" ఇతి | భవతు | అలం వృథా శ్రమేణ | సర్వథా దుర్లభః ఖలు తే మోక్షః | కిం బ్రవీషి – "గచ్ఛామ్యహమకాలభోజనమపి పరిహార్యమ్" ఇతి | హీ హీ సర్వ కృతమ్ | ఏతదవశిష్టమస్ఖలితపంచశిక్షాపదస్య భిక్షోః కాలభోజనమతిక్రామతి | ధ్వంసస్వ | వృథాముండనశ్చిత్రిదద్రుణాపత్రపతే | గచ్ఛ, బుద్ధో హ్యసి | హన్త ! ధ్వస్త ఏష దురాత్మా | తత్ క్వ ను ఖల్విదానీం దుష్టశాక్యభిక్షదర్శనోపహతం చక్షుః ప్రక్షాళయేయమ్ | (పరిక్రమ్య)

సాధు భో ఇదం విటజననయనపావనముపస్థితమ్ | ఏషా హి వసన్తవత్యా దుహితా వనరాజికా నామ వనరాజికేవ రూపవతీ కుసుమసమాజమివ శరీరే సన్నివేశ్య యథోచితం పూజాపురస్కారముపనీయ కామదేవాయతనాదవతరతి | యదా సర్వాదరగృహీతపుష్పమండనాటోపా శంకే ప్రియజనసకాశం ప్రస్థితయాఽనయా భవితవ్యమ్ | యావదేనాం ప్రియవచనోపన్యాసేనోపసర్పామి | (నిర్దిశ్య) వాసు వనరాజికే, కిమిదం వసన్తకుసుమాగ్రయణం కుర్వన్త్యా భవత్యా న ఖల్వతిథిలోపః కృతః | కిమాహ భవతీ – "స్వాగతమార్యాయ, అయమంజలిః" ఇతి | ప్రతిగృహీత ఏష దాక్షిణ్యపల్లవః | అపి చ, అచిరాదాగతస్తావద్ వసన్తస్తవ శరీరే సన్నివిష్టో నను | కిమాహ భవతీ – "కథమివ" ఇతి | శ్రూయతాం తావత్ –

---

"మన్నించు. అన్ని ప్రాణులయందు ప్రసన్నచిత్తమున ప్రవర్తింపవలెను" అంటున్నావా? ఇక్కడ భదంతుడు నిత్యప్రసన్నుడై తృష్ణను ఛేదించి పరినిర్వాణమును పొందును. చేతులు జోడించుచున్నారు.

*(తృష్ణాచ్ఛేదము = ఇది బౌద్ధపారిభాషికంలో కోరికలను జయించడమని అర్థం. వ్యావహారికార్థంలో సారాయి త్రాగి దప్పి తీర్చుకొనుట. తృష్ణాచ్ఛేదము అన్న పాఠం సరికాకపోవచ్చు. అది తృష్ణాఛేదము కావాలి. పరినిర్వాణమవాప్స్యసి = బౌద్ధపరిభాషలో జ్ఞానలబ్ధి. ఇంకా స్పష్టంగా చెప్పాలంటే దీపము ఆరిపోవుట. ఇక్కడ అర్థం ఊహించదగినది).*

"సరి, నన్ను వదలండి" అంటున్నావా? కానిమ్ము. అనవసరశ్రమ ఎందుకు? నీకు ఎల్లెడలా మోక్షము దుర్లభము కదా. " అకాలభోజనం నివారించాలి. వెళతాను" అంటావా? హీ హీ అన్ని నియమాలు పూర్తి అయినాయి. పంచశీలను వదిలిన ఈ భిక్షువుకు మిగిలినదిదే. సమయానికి భోజనము అన్న నియమము అవశ్యం తప్పకూడదు. ధ్వంసము చెయ్యిక. వెళ్ళు. బుద్ధుడివయితివి. హో, ఈ దురాత్ముడు భ్రష్టుడు. ఈ దుష్టబౌద్ధభిక్షువును చూచిన కన్నులను ప్రక్షాళన చేసుకోవాలి. (ముందుకు నడచి) ఆహో, ఇదో విటజన నయన పావనమైనది. ఈవిడ వసంతవతి కుమార్తె, వనరాజికా, నిజంగా వనరాజిక వంటి రూపవతి పూలతో శరీరాన్ని అలంకరించుకుని యథోచితమైన పూజాద్రవ్యాలను తీసుకుని కామదేవుని పూజకై వెలసినట్టున్నది. చాలా శ్రద్ధగా పూలసింగారాలతో తనువును భవ్యంగా అలంకరించుకున్నది. తన ప్రియుని వద్దకు వెళుతున్నట్టు తెలుస్తూంది. (సైగ చేసి)

అమ్మాయీ వనరాజికా, వసంతకాలానికి మొదటి పూజలా పూలనలంకరించుకున్న నీవు అతిథిని మరిచావేమి? ఏమన్నావూ? "ఆర్యునికి స్వాగతం, అంజలి" అనియా. నీ దాక్షిణ్యపల్లవము స్వీకరింపబడినది. ఇంకా, ఈ మధ్యనే వచ్చిన వసంతము నీ శరీరంలో తిష్టవేసింది సుమా. "ఎలాగ" అంటివా? విను.

వాసన్తీకున్దమిశ్రైః కురవకకుసుమైః పూరితః కేశహస్తో
లగ్నాశోకః శిఖాన్తః స్తనతటరచితః సిన్దువారోపహారః |
ప్రత్యగ్రైశ్చూతపుష్పైః ప్రచలకిసలయైః కల్పితం కర్ణపూరః
పుష్పవ్యగ్రాగ్రహస్తే వహసి సువదనే మూర్తిమన్తం వసన్తమ్ ||

కిం బ్రవీషి – "ఏష తే ప్రదేయకః" ఇతి | భవతు | త్వయ్యేవతావత్తిష్ఠతు న్యాసః | కాలేనోపపాదయిష్యామః | సుఖం భవత్యై | ప్రస్థితోऽస్మి | (పరిక్రమ్య)

అయే ఇదమిరిమకామిన్యాస్తాంబూలసేనాయా గృహమ్ | నిత్యసన్నిహితశ్చాత్ర ధాన్త్రః | కిం ను ప్రవిశామి | (విచార్య) న శక్యమనభిభాష్యాతిక్రమితుమ్ | యావత్ ప్రవిశామి | (ప్రవిశ్య)

---

కేశహస్తః = జుట్టుముడి, వాసంతీకుందమిశ్రైః = మల్లెల, మొల్లలచేరికతో, కురవకకుసుమైః = కురవక పుష్పములతో, పూరితః = నింపబడినది. శిఖాన్తః = జడచివరిభాగం లగ్నాశోకః = అశోకముతో చేర్చినదైనది. సిందువార ఉపహారః = నిర్గుండీలతలతో కూర్చిన చిన్న మాల, స్తనతటరచితః = స్తనతటము రచింపబడినది. ప్రత్యగ్రైః = బాగా వికసించిన, చూతపుష్పైః = మామిడి పూలతోనూ, ప్రచలకిసలయైః = మిక్కిలి కదలుచున్న చివురుటాకులతోనూ, కర్ణపూరః = చెవిపోగు, కల్పితః = కల్పింపబడింది. సువదనే = సుందరవదనా, పుష్పవ్యగ్రాగ్రహస్తే= పూలచేత కనుమరుగైన చేతిని కలిగి (అంజలి నిండుగ పూలను నింపుకుని), మూర్తిమంతం వసంతం = మూర్తీభవించిన వసంతాన్ని, వహసి = ధరించినావు.

తాత్పర్యము: మల్లెల, మొల్లల జడముడిని, అశోకముతో జడచివర్లను, నిర్గుండీలతల మాలికతో స్తనతటాన్ని, వికసించిన మామిడిపూలతోనూ, చివురుటాకులతోనూ చెవిపోగులను, అంజలిలో పూలను నింపుకుని సుందరముఖీ, నీవు మూర్తీభవించిన వసంతాన్ని ధరించావు.

*విశేషములు: స్రగ్ధరావృత్తము. అంగనలేయే కుసుమములనేయే యంగముల నలంకరింతురో వివరించు మనోహరమైన పద్యము. మూర్తిమన్తం వసన్తం వహసి – అనగా మూర్తీభవించిన మదనుని నీ తనువున నిలిపితివని యర్థశ్లేష.*

ఏమంటావు – "ఇవి మీకు ఇవ్వదగినవి" అనియా. కానిమ్ము. తగిన సమయము వచ్చినప్పుడు స్వీకరింతును. నీకు సుఖమగుగాక.నేనిక ఏతెంతును. (ముందుకు నడచి)

అరే, ఇది ఇరిమ్ (Hermes అనే యవనుడు) అనువాని ఉంపుడుగత్తె తాంబూలసేన ఇల్లు. ఈ మనిషి ఎప్పుడూ ఇక్కడే పడి ఉంటాడు. వెళ్ళుదునా? ఆలోచించి) పలుకరించకుండ ముందుకెళ్ళడం కుదరదు. సరే, లోపలికెళతాను. (ప్రవేశించి)

అస్తి కోऽపి భోః సహృదగృహే శశం ప్రతిపాలయతి? అయే ఇదం తాంబూలసేనా అస్మద్ బహుమానాదవిలంబిత త్వరితపదవిన్యాసా సంభ్రమాద్ భ్రష్టముత్తరీయమాకర్షన్తీ ప్రద్వార ఏవ ప్రద్యుద్గతా | అత్యుపచారః ఖల్వేషః | శంకే న మాం ప్రవిశన్తమిచ్ఛతీతి | తదేషా బహిరేవ ప్రయోజయితుం నిర్గతా | యథాऽస్యః ప్రత్యగ్రసురతచిహ్నాన్యుపలక్షయే సద్యః సురతభుక్తముక్తయాऽనయా భవితవ్యమ్ | నూనం దివాసురతసంమర్దమనుభూతవానిరిమః | అహో సురతలోలుపః ఖలు ధాన్త్రః | భవతు | పరిహాసిష్యామ్యేనామ్ |

తాంబూలసేనే | కిమిదం దాక్షిణ్యాతివ్యయః క్రియతే | కథం సురతపరిశ్రమశ్వాసవిచ్ఛిన్నాక్షరం 'స్వాగతం ప్రియవయస్యాయ' ఇత్యాహ | అవిరక్తికే తాలవృన్తం తావదానయ | కృతవ్యాయామా ఖలు తాంబూలసేనా | చోరి, అపి బలం వర్ధతే? కిం బ్రవీషి – "న ఖల్వవగచ్ఛామి" ఇతి |ఏతత్ప్రియజనపరిష్వంగసంక్రాన్తకాలేయకం స్తనతటద్వయమ్ | పృచ్ఛామి తావత్ | అసన్తుష్టే అనవరతనిశావిహారస్వైరిమస్య దివాऽపి నామ త్వయా న దేవో విశ్రమః | నను సాయంప్రాతర్హోమో వర్తతే | కిం బ్రవీషి – "సదాపి నామ పరపక్షపరిహాసప్రియో భావ ఇతి|" నైతదస్తి | అపి దుర్విదగ్ధే న త్వయా శ్రుతపూర్వ 'ఆకారసంవరణమప్యాకార ఏవ' ఇతి | కిం బ్రవీషి – "కథం జానీషే" ఇతి | చోరి, కథమిదం న జ్ఞాస్యామి | యథా –

---

మిత్రుని ఇంట్లో శశుని ఆదరించేవారెవరైనా ఉన్నారా? అరే, తాంబూలసేన గాభరాగా అడుగులు తడబడుతుండగా, ఉత్తరీయాన్ని సర్దుకుంటూ ప్రధాన ద్వారం దగ్గరకే వచ్చింది. అవసరానికి మించిన ఆదరణ ఇది. నా రాక ఈమెకు నచ్చినట్టు లేదు. అందుకే బయటకే వచ్చి నిలబడింది. ఈమె శృంగారచిహ్నాలు చూస్తూ ఉంటే ప్రణయం మధ్యలో వచ్చినట్టు ఉన్నది. నిశ్చయంగా ఇరిముడు పగటిసమయంలో శృంగారానుభూతి చవి చూసి ఉంటాడు. వీడొక మదపిచ్చి గాడు కాబోలు. కానిమ్ము. ఈమెతో కాస్త వేళాకోళమాడతాను.

తాంబూలసేనా! ఇంత ఆతిథ్యం ఎందుకు? శృంగారశ్రమతో పదాలు తడబడుతూ "ప్రియమిత్రుని స్వాగతం" అనుట ఎట్లు? తాంబూలసేన మంచి వ్యాయామం చేసింది కదూ. ఓ చోరీ, బలం కూడా పెరుగుతోందా లేదా? ఏమంటున్నావు – "అర్థమవటం లేదు" అనియా? ప్రియుని పరిష్వంగం వలన ఈమె స్తనతటద్వయం తాలూకు చందనం చెరిగిపోయింది. అదే అడుగుతాను. ఓ కామవాంఛాపిపాసినీ, నిరంతరయామినీవిహారమత్తుడైన ఇరిమునికి పగటిపూటైనా విశ్రాంతినివ్వవూ? పొద్దునా, సాయంకాలమూ, రెండు పూటలా హోమము నడుస్తుంది కదూ? ఏమంటావు – "పండితులకు ఎప్పుడూ ఇతరులను ఆటపట్టించటం అలవాటు" అనియా? అదేమీ కాదు. తెలివిలేనిదానా, 'ఆకారాన్ని దాచటంతో ఆకారం ప్రకటితమవుతుంది' అని వినలేదా?"ఎలా తెలుస్తుంది" అంటావూ? దొంగా, ఎలాగా –

విఖణ్డితవిశేషకం మృదితరోచనాబిందుకం
కపోలతలలగ్నకేశమపవిద్ధకర్ణోత్పలమ్ |
ముఖం వ్రణితపాటలోష్ఠమలసాయమానేక్షణం
ప్రకాశయతి తే దివాసురతలోలుపం కామినమ్ ||

కిం బ్రవీషి – "సద్యః సుప్తోత్థితాऽహం, కిమప్యాశంకశే" ఇతి | భవతు|      సంజ్ఞాప్తాః స్మః | న హి తే సూక్ష్మమపి కించిదగ్రాహ్యం పశ్యామి | కిన్తు –

---

విఖండితవిశేషకం = చెరిగిన పత్రలేఖ, మృదితరోచనాబిందుకం = ముద్ద అయిన తిలకము, కపోల తల లగ్నకేశం = చెక్కిళ్ళపై పడిన కురులు, అపవిద్ధ కర్ణోత్పలం = అపభ్రంశమయిన చెవి తాలూకు పువ్వు, వ్రణితపాటలోష్టం = గాయమైన పగడాల పెదవి, అలసాయమానేక్షణం = అలసించిన కనులు గల, కామినం ముఖం = కామి ముఖము, తే = నీయొక్క, దివాసురతలోలుపం = పగటి శృంగారపిపాసను, ప్రకాశయతి = తెలియబరచుచున్నది.

తాత్పర్యము: చెరిగిన పత్రరేఖ, ముద్దగా మారిన తిలకము, చెక్కిళ్ళపై పడిన కురులు, పక్కకు జరిగిన చెవి తాలూకు పువ్వు, గాయమైన పగడాల పెదవి, అలసిన కనులు గల కామిని ముఖము నీ పగటిశృంగారకాంక్షను తెలియజేస్తోంది.

*విశేషము : పృథ్వీవృత్తము (జసౌ జసయలా వసుగ్రహ యతిశ్చ పృథ్వీ గురుః*
*వసు = 8 వసువులు, గ్రహ = 9 గ్రహాలు. పాదమునకు పదిహేడక్షరములు. జ స జ స య లఘువు, గురువు)*
*విశేషకం/పత్రలేఖ యనగా చెక్కిలిపై ముద్రించుకొను ఒక అలంకారము.*

*హిమవ్యపాయా ద్విశదాధరాణామాపాణ్డరీభూత ముఖచ్ఛవీనాం |*
*స్వేదోద్గమః కింపురుషాంగనానాం చక్రేపదం పత్రవిశేషకేషు || (కుమారసంభవం 3 –33)*

*(వసంతకాలము చెమట వలన స్త్రీలచెక్కిళ్ళపై గల పత్రరేఖలను తుడిపివేసినది)*

"ఇప్పుడే నిద్రలేచాను. కానీ మీరు ఏదో శంకిస్తున్నారు" అంటావా. కానిమ్ము. నాకు తెలిసినది. నీయొక్క అగ్రాహ్యమైన విషయాన్ని ఒకదాన్ని కొంచముగా చూస్తున్నాను. కానీ –

స్వప్నాన్తే నఖదన్తవిక్షతమిదం శంకే శరీరం తవ
ప్రీయన్తాం పితరః స్వధాऽస్తు సుభగే వాసోऽపసవ్యం హి తే |
కించాన్యత్త్వరయా న లక్షితమిదం ధిక్ తస్య దుఃశిల్పినో
మోహాద్ యేన తవోభయోశ్చరణయోః సవ్యే కృతే పాదుకే ||

చోరి సహోఢాభిగృహీతా క్వేదానీం యాస్యసి | ఏషా హి ప్రవిశ్యన్తర్గృహముచ్చైః ప్రహసితా సహ రమణేన | (కర్ణం దత్వా) ఏష ఇరిమో వ్యాహరతి – "నను భో ధూర్తాచార్య ప్రవిశ్యతామ్" ఇతి | సఖే కః సురథరథధుర్యయోర్యోక్తృచ్ఛేదం కరిష్యతి | ఏవమేవావిరతసురతోత్సవోऽస్తు | గార్గీపుత్ర, సాధయామ్యహమ్ |

---

తవ = నీయొక్క, శరీరం = ఒళ్ళు, స్వప్నాంతే = కల గని లేచిన తర్వాత, (కలలో సురతం జరిగి అని శ్లేష) నఖదన్తవిక్షతమిదం = గోళ్ళ, పంటి నొక్కులకు గురి అయినదిగా, శంకే = అనుకుంటున్నాను. సుభగే = సుందరి, తే = నీ యొక్క, వాసోऽపసవ్యం = ఉత్తరీయం తిరగబడుట (వలన), పితరః, స్వధాః తు = పితరులు, పితృదేవతలు, ప్రీయన్తాం హి = తృప్తినొందుదురు గాక. కించ అన్యత్ = ఇంకనూ, తవ = నీయొక్క, ఉభయోః చరణయోః = రెండుపాదాలలో, యేన = ఎవనిచేత, మోహాత్ = మోహమువలన, తవ = నీయొక్క, పాదుకే = చెప్పులను, సవ్యే కృతే = బాగు చేయబడినదో, తస్య = అతని, దుఃశిల్పినః = పాదరక్షలను బాగుచేయు వాని ని, అనయా = నీచేత, ఇదం = ఇలా బాగు చేయుట, న లక్షితం ధిక్ = గమనింపబడలేదు. అయ్యో!

తాత్పర్యము: సుందరీ! నీ ఒంటిపై గోళ్ళ, పంటి నొక్కులు కలలో జరిగిన శృంగారక్రీడ వల్ల వచ్చినవి లే. నీ ఉత్తరీయం తిరగబడింది. అది పితృదేవతలను తృప్తిపరిచేదానికి అపసవ్యం చేయబడింది లే. అలాగే నీ పాదాల చెప్పులు తారుమారయినందుకు కారణం పాదరక్షకల శిల్పి. అందుకే నీవు దాన్ని లక్ష్యం చేయలేదు.

*విశేషములు: శార్దూలవృత్తము. స్వప్నాన్తే = కల చివరన – అంటే కలలో శృంగారక్రీడ జరిగి, ఆ తర్వాత నిద్రలేవగానే, కలలో జరిగిన క్రీడ కారణంగా నొక్కులు వచ్చాయా? అని ఎగతాళి. వాసోऽపసవ్యం పితరః, స్వధాస్తు ప్రీయన్తాం – శ్రాద్ధకర్మ (పితృకార్యం) చేసేప్పుదు, జంధ్యమును అపసవ్యదిశలో వేసుకుని జరపడం సాంప్రదాయం. దానిని దృష్టిలో పెట్టుకుని, ఈ అమ్మాయి ఉత్తరీయం అపసవ్యదిశలో తిరిగి ఉండటాన్ని పితృకార్యానికి ముడిపెట్టి వెక్కిరిస్తున్నాడు.*

చోరి, దొంగతనపు సొమ్ముతో పట్టుబడిన నీవింకెక్కడ తప్పించుకుంటావు? ఆ.. ఆమె తన ఇంటిలోపలికి వెళ్ళి తన ప్రియునితో కలిసి పెద్దగా నవ్వుతున్నది. (చెవి యొగ్గి) ఇరుముడంటున్నాడు – "ధూర్తాచార్య ! లోపలకు రమ్ము" అని. మిత్రమా! శృంగారరథమునకు కట్టిన ఎద్దుల జోడిని ఎవడు విడిపించును? ఎలాగే నిరంతరము సురతోऽత్సవమగుగాక. గార్గీపుత్ర, ఇక నేనేతెంతును.

(పరిక్రమ్య) అయే కేయమిదానీం బాహ్యద్వారకోష్టకే దేవతాభ్యో బలిముపహరతి ?

నిభృతవదనా శోకలగ్నా నిరంజనలోచనా
మలినవసనా స్నేహత్యక్తప్రలంబఘనాలకా |
శిథిలవలయా పుష్పోత్క్షేపైశ్చ్యుతాంగుళివేష్టనా
తరుణయువతిస్తన్వీ భూయస్తనుత్వముపగతా ||

ఆ ఏషా భాణ్డీరసేనాయా దుహితా కుముద్వతీ నామ | భోః కష్టమ్ | అప్రత్యభిజ్ఞేయా ఇయం తపస్వినీ సంవృత్తా | తత్ కస్యేయం వేశవాసవిరుద్ధం విరహయోగవ్రతం చరతి | ఆ విజ్ఞాతమ్ | తమేషా మౌర్యకుమాతం చంద్రోదయమనురక్తేతి శ్రూయతే | స చ సుభగః సామన్తప్రశమనార్థం దణ్డేనోద్యతః | హన్త భో ఉపపద్యతే చంద్రోదయవిరహాత్ కుముద్వతీ నిఃశ్రీకా సంవృత్తేతి | భోః ప్రత్యాదేశః ఖల్వియం కులవధూనామ్ | అపి చైష స్వభవనవలభీపుటస్థం విక్షిప్తబలిప్రణయోపస్థితం స్వాగతవ్యాహారేణాభినందతి వాయసమ్ –

---

(ముందుకు నడచి) అరే, ఎవరిది ? బయటి తలుపు వద్ద దేవతలకు బలినిడుచున్నది?

నిభృతవదనా = దిటవుగనున్న ముఖము గలది, శోకలగ్నా = దుఃఖించుచున్నది, నిరంజనలోచనా = కాటుక చెరగిన కనులది, మలినవసనా = మరకదుస్తులది, స్నేహత్యక్తప్రలంబ ఘనాలకా = తైలసంస్కారము లేని దీర్ఘకేశములు గలది, శిథిలవలయా = సన్నటి నడుముది, పుష్పోత్క్షేపైః = పూలు విసరుట వలన, చ్యుతాంగుళివేష్టనా = వీడిన వ్రేళ్ళుగలది, తన్వీ = సుతను సుందరి, తరుణయువతిః = కన్యామణి, భూయః = మిక్కిలి, తనుత్వముపగతా = శరీరమును పొందినది.

తాత్పర్యము: గంభీరమైన ముఖము గలది, దుఃఖిత, కరిగిన కాటుక కలది, మలినమైన దుస్తులది, తైలసంస్కారము లేని పొడవైన కేశములు కలది, చిక్కిన నడుముది, పూలు విసరుటచేత వీడిన వ్రేళ్ళది, సుతనువు గల ఈ సుందరి, తిరిగి లావుగయైనది.

*విశేషములు: ఉపమాలంకారము. విరహజనితశోకము దీర్ఘకాలమనుభవించుట ఊబకాయమునకు హేతువు. హరిణీవృత్తము (న స మ ర స లఘువు గురువు. ప్రతిపాదమున పదిహేడు అక్షరములు)*
ఆ, ఈమె భాండీరసేన కుమార్తె కుముద్వతి యనునది. అహో, కష్టము. ఈ తపస్విని గుర్తుపట్టకుండగ తయారయినది. ఎవనికై ఈమె తన వేషమునకు విరుద్ధముగ విరహవ్రత మాచరించుచున్నది. ఆ తెలిసినది. ఈమె ఆ మౌర్యకుమారుడైన చంద్రోదయునిపై మరులు గొన్నదని విన్నాను. ఆ సౌభాగ్యవంతుడు సామంతులను యణచుటకు వెడలెను. హా, చంద్రోదయవిరహముచేత ఈ కుముద్వతి భాగ్యహీన అయినది. ఈమె కులవధువులను కూడ జయించినది. తన ఇంటి చూరుపై నిడిన బలియన్నమునకై వచ్చిన కాకికి ఇలాగున స్వాగతవచనము చేత అభినందించుచున్నది –

భద్రం తే వలభీగవాక్షతిలకశ్రాద్ధోపహారాతిథే
జీవన్త్యాం మయి కచ్చిదేష్యతి స మే నిత్యప్రవాసీ ప్రియః |
యద్యాగచ్ఛతి గచ్ఛ తావదితరద్వారాశ్రితాం తోరణం
నిఃశోకా హి సమేత్య మే ప్రియతమం దాస్యామి దధ్యోదనమ్ ||" ఇతి |

అహో తు ఖలు నిష్కైతవోఽనురాగః | అనపహాసక్షమమేతత్ రాజయౌతకమ్ | మహిష్యావగుణ్ఠనభాగినీ భవత్యేషా | ఇతో వయమేకాన్తేన గచ్ఛామః | (పరిక్రమ్య) –
అహో అయమిదానీం దక్షిణేన వృక్షవాటికాం భూషణప్రసాదాత్ సంభ్రాన్త విహగసంకులః శబ్ద ఇవ శ్రూయతే | భవతు | అపావృతద్వారేయం వృక్షవాటికా | యావదవలోకయామి | (విలోక్య) హీ హీ నయనోత్సవః ఖల్విహ వర్తతే | తథాహి –
పాంచాలదాస్యా దుహితా ప్రియంగుయష్టికా నామ జఘనోత్సేకోత్పాదితాహంకారేణ యౌవననవరాజ్యకేన విలోభ్యమానా నానావిలాసభావహావదాక్షిణ్యసముదితా సఖీజనపరివృతా కందుకక్రీడామనుభవతి | యైషా –

---

వలభీగవాక్షతిలకశ్రాద్ధోపహార అతిథే = ఇంటిచూరున గల గవాక్షమున నిడిన కుంకుమ కలిపిన శ్రాద్ధన్నమును స్వీకరించు అతిథీ!, తే భద్రమ్ = నీకు శుభము. మే = నాయొక్క, సః నిత్యప్రవాసీ ప్రియః = ఆ నిరంతరప్రవాసమున గల ప్రియుడు, జీవిన్త్యాం మయి = జీవించి ఉన్న నన్ను, కశ్చిత్ ఏష్యతి = ఎప్పుడైనా పొందగలడా? యది ఆగచ్ఛతి = వచ్చినచో, తావత్ = అప్పుడు, ఇతరద్వారాశ్రితం తోరణం = ఇంకొక ఇంటి ద్వారమునగల తోరణమునకు, గచ్ఛ = పొమ్ము. మే = నాయొక్క, ప్రియతమం = ప్రియతముని, నిఃశోకా హి సమేత్య = శోకమును వీడి అతనితో చేరి, దధ్యోదనం = పెరుగన్నమును, దాస్యామి = ఇత్తును.

తాత్పర్యము: చూరున గల గవాక్షమున చేరిన ఓ వాయసమా! నీకు శుభము. నా నిత్యప్రవాసి ప్రియుడు, తనకొరకే జీవించిన నన్ను ఎప్పుడు చేరును? అతడు వచ్చిన, నీవు పక్కింటి ద్వారతోరణమునకు పొమ్ము. అతనితో కలిసి ఆనందముగ నీకు పెరుగన్నమును సమర్పింతును.

*విశేషము: ప్రోషితభర్తృక యను నాయిక వర్ణనము. కరుణ గర్భితము. శార్దూలవృత్తము. (మ స జ స త త గ)*

అహో, నీ యనురాగము మచ్చలేనిది. ఈ రాజకుమారి యను వరమాలను పరిహాసము చేయుట తగదు. ఎవడైన రాజవృషభుని చేత నీమె వధూభావపు మేలిముసుగు తొలగించబడుగాక. ఇక మేము ఒంటరిగ వెళ్ళుదుము. (ముందుకు నడచి)

అరే, ఇప్పుడిది దక్షిణమున వృక్షవాటికలను నాశ్రయించిన పక్షుల కలకలారావము వలె వినిపించుచున్నది. కానిమ్ము. ఈ తోట తలుపు తెరచియున్నది. ఇక పరికింతును. (చూచి) ఆహా, ఇక్కడ నయనోత్సవముగ నున్నది గదా! అందుకే పాంచాలదాస్య కూతురు ప్రియంగుయష్టిక అను తరుణయవ్వని నితంబముల వృద్ధి చేత గర్వితురాలై నానా హావభావవిలాసదాక్షిణ్యములతో, సఖీజనముతో చేరి బంతియాట ఆడుచున్నది. ఈమె –

ప్రవాళలోలాంగుళినా కరేణ
మానః శిలంకందుకముద్వహన్తీ |
స్వపల్లవాగ్రాభిహతైకపుష్పా
నతోన్నతా నీపలతేవ భాతి ||

---

ప్రవాళలోల అంగుళినా = నవపల్లవముల పగిది వ్రేళ్ళచేత, కరేణ = చేతితో, మానఃశిలం = పగడమువంటి, కందుకం = బంతిని, ఉద్వహన్తీ = పట్టుకొన్నది. స్వపల్లవ అగ్ర అభిహతైక పుష్పా = చివురుటాకుల చివరన కుసుమించిన పుష్పములు గల, నతోన్నతా = పైకి క్రిందకూ కదలుచున్న, నీపలతా ఇవ = కడిమితీవె లాగున, భాతి = ప్రకాశించుచున్నది.

తాత్పర్యము: నవపల్లవముల వంటి యెర్రనైన చేతులతో పగడము వంటి బంతిని పట్టుకున్న యువతి, చివురుటాకుల చివరన కుసుమించిన పుష్పములు గల కడిమెతీవె వలె ప్రకాశించుచున్నది.

*విశేషములు: మనోహరమైన ఉపమ. కడిమిచెట్టు వర్షాకాలమున దీపపు వెలుగుల కుప్ప వలె ప్రకాశించును. దీనిని కవులు మిక్కుటముగ వర్ణించియున్నారు. శూద్రకమహాకవియే తన మృచ్ఛకటిక నాటకమున వర్షఋతు వర్ణన యందు కదంబమును యద్భుతముగ వర్ణించెను. స్వపల్లవాగ్రాభిహతైక పుష్పా. ఇది వస్తుధ్వని. కడిమి చెట్టు కొమ్మన చివురుటాకుల చివరన ఉదయించిన సుమమని యర్థము. లేజేతుల యొక్క వ్రేళ్ళయందిదుకొనిన బంతి యని చమత్కారము. కడిమి పువ్వునూ చూచుటకు బంతివలె నుండును. (ఉపేంద్రవజ్ర – జ త జ రెండు గురువులు)*



కామకస్యాః సందర్శనమేవానర్ఘో లాభః | భవతు | సంతుష్టస్యాపి జనస్య న త్వమృతే పర్యాప్తిరస్తి | అతోఽభిభాషిష్యే తవదేనామ్ | (ఉపగమ్య) వాసు ప్రియంగుయష్టికే కిమిదం కందుకక్రీడావ్యాజేన నృత్తకౌశలం ప్రత్యాదిశ్యతే సఖీజనస్య | కథం స్మితమాత్రదత్తప్రతివచనా క్రీడత్యేవ | ఆ యథా కందుకోత్పాతాన్ గణయన్త్యస్యాః పరిచారికాః శంకే పణితమనయా సఖీభిః సహోపనిబద్ధమితి |

అహో పణితప్రీతిః | సర్వథా నతోన్నతావర్తనోత్పతనాపసర్పణప్రధావన చిత్రప్రచారమనోహరమ్ | యదృచ్ఛయా దృశ్యమాసాదితం ఖల్వస్మాభిః | కిం బహునా |

శంకే పరివర్తననివర్తనోద్వర్తనపర్యాధ్మాతవసనాన్తర ప్రవేశకుతూహలో వాయురప్యేనామభికామోఽనుభ్రమతీతి | యత్సత్యం స్వభావదుర్బలత్వాదేకపాణిగ్రాహస్య యౌవనపీతపయోధరభారనమితస్య బిభేమ్యహమస్యా మధ్యవిసంవాదనస్య | న శక్యామేనాముపేక్షితుమ్| అభిభాషిష్యే తావత్ | అయి యౌవనోన్మత్తే స్వసౌకుమార్యవిరుద్ధః ఖల్వయమారంభః క్రియతే | విరమ విరమ తావత్ | అయే త్వాం ఖలు బ్రవీమి | కథముపారోహత్యేవాస్యాః ప్రహర్షః |

హన్త ఇదానీమాశాస్యే –

---

ఈమెను చూచుటయే ఒక వెలలేని లాభము. కానిమ్ము. ప్రీతి చెందిన వారు అమృతముతోనూ సరిపెట్టరు. కావున ఈమెతో సంభాషింతును. (చేరికొని) బాలా! ప్రియంగుయష్టికా. ఏల నీవు బంతియాడునెపమున సఖుల నృత్తకౌశలమును ఆదేశించుచున్నావు?       మందహాసపూర్వకమైన సమాధానము మాత్రమునిచ్చి తిరిగి యాటలో నిమగ్నమైనది. ఆ, పరిచారికలు బంతి ఎన్నిసారులు క్రిందపడెనో లెక్కించుచున్నారు. చెలులతో నేదో పందెమొడ్డినది యనుకొనుచున్నాను.

ఆహా, పందెపు ఉత్సాహము! ఎల్లెడలా పరిగెత్తుట, క్రిందకు వంగుట, పైకి లేచుట, వెనుకకు మరలుట వంటి అంగచాలనములతో అతిమనోహరమైన యరుదైన చలనచిత్రమును చూచితిని. మాకొరకే ఈ దృశ్యము తీర్చినది కాబోలు. పెక్కేల?

అటునిటు తిరుగుచు, వెనకకు మరలుచు, పైకెగురుచు, దుముకుచు నున్న యీమె వస్త్రముల మధ్యన జొరబడు మందానిలము కోర్కె చేత ఈమెననుసరించుచున్నట్లున్నది.       ఈ యువతి స్తనభారముల చేత సన్నని నడుము తాళక క్రిందికి పడరాదు. ఇక ఈమెను పలుకరింపక ఉపేక్షింపరాదు. ఈమెతో నిక మాట్లాడుదును. యౌవనముచేత గర్వమునందిన తరుణీ. సౌకుమార్యవిరుద్ధమైన పనిని చేయుచున్నావు. ఇక ఆపుమాపుము. అరే, నిన్ను గూర్చియే చెప్పుచున్నాను. ఏల నీ ఆనందము పొంగుచున్నది?

హా! ఇది నా యాశంస.

ప్రేంఖోలత్కుణ్డలాయా బలవదనిభృతే కందుకోన్మాదితాయాః
చంచద్బాహుద్వయాయాః ప్రవికచవిసృతోద్గీర్ణపుష్పాలకాయాః |
ఆవర్తోద్భ్రాన్తవేగప్రణయవిలసితక్షుబ్ధకాంచీగుణాయాః
మధ్యస్యావల్గమానస్తనభరనమితస్యాస్య తే క్షేమమస్తు ||

ఏషా పూర్ణే శతమితి వ్యవస్థితా వాసు ప్రియంగుయష్టికే సఖీజనపణితవిజయేన దిష్ట్యా వర్ధసే | కిం బ్రవీషి – "స్వాగతమార్యాయ, హన్త విజయార్ఘం గృహ్యతామ్" ఇతి | వాసు త్వద్దర్శనమేవానర్ఘో లాభః | స్మర్తవ్యా స్మః | సాధయామో వయమ్ | (పరిక్రమ్య)

అయే ఇదమపరం సుహృద్వినోదనాయతాముపస్థితమ్ | ఇదం హి చంద్రధరకామిన్యా నాగరికాయా దుహితుః శోణదాస్యా గృహమ్ | ఏష ప్రవిశామి | న శక్యమనభిభష్యాతిక్రమితుమ్ | (ప్రవిష్టకేనావలోక్య)

---

ప్రేఙ్ఖోత్కుండలాయా = ఎగురుచున్న చెవిపోగులదానికి, బలవత్ అనిభృతే = బలము వలన పట్టుకొనజాలని, కందుక ఉన్మాదితాయాః = బంతికై వెర్రిగ యగు దానికి, చంచద్బాహుద్వయాయ = చలించిన రెండు భుజములు గలదానికి, ప్రవికచ విస్రుత ఉద్గీర్ణ పుష్ప అలకాయాః = చెదరిన ముంగురులపై వికసించిన పూలు పడిన దానకు, మధ్యస్య ఆవల్గమాన స్తనభర నమితస్యాయ = స్తనభారమున వంగిన, చిక్కిన నడుము దానకు, ఆవర్త ఉద్భ్రాన్త వేగప్రణయవిలసిత క్షుబ్ధకాంచీగుణాయాః = వేగముగ తిరుగుటవలన పైకెగరుటవలన, వేగముగ కదలుటవలన మెరయుచూ చిన్నదిగ కనిపించు బంగరుమొలనూలు గల దానకు, తే = నీకు, క్షేమమస్తు = శుభమగుగాక!

తాత్పర్యము: ఎగరుచునున్న చెవిప్రోగులదానికి, వేగముగ బంతికై వెర్రిగ పరిగెడుదానకు, కదలుచున్న భుజద్వయముల దానకు, చెదరిన ముంగురులపై యతికిన పూల రేకులు కలదానకు, స్తనభరమున వంగిన నెన్నడుము దానకు, కంఠహారము తిరగుట, కదలుట, ఎగరుట మున్నగు కారణములచేత బంగరుమొలనూలు మెరపునొందిన దానకు నీకు శుభమగుగాక!

*విశేషము: మనోహరమైన తరుణయువతీవర్ణనము. స్రగ్ధర.*

నూరు పూర్తయినవి కాబోలు, ఆగినది. బాలా, ప్రియంగుయష్టికా. సఖులతో బంతియాట గెలిచినందుకభినందనలు."ఆర్యునికి స్వాగతము. హా, విజయార్ఘ్యమును స్వీకరించుము" అనుచున్నావా? బాలా, నీ దర్శనమే నాకొకయమూల్య లాభము. మేము గుర్తుందుము గాక. ఇక మేమేగుదుము. (ముందుకు నడచి)

అరే, నా మిత్రుని వినోదింపజేయునొక గృహోద్యానమును జేరితిని. ఇదే చంద్రధరకామిని కూతురు శోణదాస్య ఇల్లు. ఈ ఇంటిలోనకు ప్రవేశింతును. ఈమెను పలుకరింపక వెడలజాలను. (ప్రవేశించి చుట్టూ చూచి),

అయే ఇయం శోణదాసీ కిమపి చిన్తయన్తీ ద్వారకోష్ఠక ఏవోపవిష్టా | తత్కిమిదానీం నిర్భక్తభూషణతయా వివిక్తశరీరలావణ్యా మలినప్రావారార్ధసంవృతశరీరా రక్తచందనానులిప్తలలాటాసితదుకూలపట్టికావేష్టితశీర్షావనతవదనచంద్రమండలాంకాధిరూఢం వల్లకీమీషత్కరరుహైరవఘట్టయన్తీ కాకలీమందమధురేణ స్వరేణ కైశికాశ్రయమాకూజయన్తీ తిష్ఠతి | ఉత్కణ్ఠితయానయా భవితవ్యమ్ | కైశికాశ్రయం హి గానం పర్యాయశబ్దో రుదితస్య | కిన్న ఖల్విదమ్ అశ్రుతపూర్వం మయా చంద్రోదయాదేవ ప్రణతకలహకృతం వ్యాహరణమనయోః |

ప్రియనిరోధాత్ పశ్చాత్తాపగృహీతయాఽనయా భవితవ్యమ్ | భవతు | పరిహాసిష్యామ్యేనామ్ |

వాసు శోణదాసి, కిమిదం వేషః పరిగృహ్యతే ? వాసు న ఖల్వయమపరాద్ధశ్చంద్రధరః ? కథం తేఽశ్రుమోక్షః ప్రతివచనమ్ ? నిగృహ్యతాం బాష్పః | కథ్యతాం తావత్ | కిం బ్రవీషి – "మానైకగ్రాహకుశలేన వ్యాపాదితాస్మి సఖీజనేన" ఇతి | నను సర్వజనాధికా తే సఖీ శోణదాసి త్వాముత్థాపయతి ? కిం బ్రవీషి – "తస్యా ఏవ దుర్మంత్రితైరాపదమిమాద్వహామి" ఇతి | అపణ్డితా ఖల్వసి | నను సా త్వయైవం వక్తవ్యా –

---

అరే, ఈ శోణదాసి ఏదో ఆలోచించుచూ వెలుపలి వాకిట గడపవద్ద కూర్చున్నది. ఏమి ఈవేళ ఆభరణములు త్యజించి, ఏకాంతమైన శరీరలావణ్యముచేత, మలినమైన చీరను శరీరమునకు అడ్డదిడ్డముగ చుట్టుకుని, రక్తచందనమును, నొసటికి పూచుకొని, మేలి ముసుగుపట్టికతో తలను కప్పుకుని వంచిన చంద్రుని వంటి ముఖము కలదై, వడిని ఉన్న వీణనువ్రేళ్ళతో కొంచెముగ కదుపుచూ, సూక్ష్మమధురావ్యక్తధ్వనులతో కైశికీవృత్తిచేత  గానమొనర్చుచు కూర్చున్నది. ఉత్కంఠముగనున్నట్టు కనిపించుచున్నది. కైశికాశ్రయమైన గానము శోకమునకు పర్యాయశబ్దము. చంద్రోదయమునకు ముందే వీరిద్దరి ప్రణయకలహమేల? వీరిద్దరి జగడ కారణమును నేను వినలేదు.

ప్రియుని యెడబాటువలన పశ్చాత్తాపమొందినట్లున్నది. కానిమ్ము. ఈమెను పరిహసింతును.

బాలా, శోణదాసి! ఏల ఈ వేషమును కట్టితివి? బాలా,  చంద్రధరుడిచేత నేదైన అపరాధము జరిగినదా? నీ కన్నీటి సమాధానమెట్టూ?  కన్నీరాపుకొనుము. ఏమిటది వివరింపుము."నాపై కేవలము గౌరవము మాత్రము వహించి (స్నేహము వహింపని) సఖి చేత మోసగింపబడితిని" అంటివా? నీకు అత్యంతప్రియమైన సఖి ఈ ద్రోహము చేసెనా?"ఆమె తప్పు సలహా చేత ఈ ఆపద పుట్టుకు వచ్చినది" అన్నావా? ఆమె మూర్ఖురాలు. ఆమెకు నీవిలా చెప్పి ఉండవలెను –

ప్రాయశ్శీతాపరాద్ధా క్షణమపి న పునర్దూతి మానక్షమాऽహం
తుష్టేదానీమనార్యే భవ మదనతులాం మామిహారోప్య ఘోరామ్ ।
మానైకగ్రాహవాక్యైరనునయవిధురైస్తావకైస్తత్ కృతం
పాణిభ్యాం యేన సంప్రత్యనుచితశిథిలాం మేఖలాముద్వహామి ॥

కిం బ్రవీషి – "పరాజితా ఇదానీం మదనేన మానః । కింతు స ఏవ తు సౌభాగ్యకృతావలేపస్తే వయస్యః స్తబ్ధః" ఇతి । తతః కిమిదానీం నాభిసార్యతే ? సుందరి, అలమలం వ్రీడయా ।

నిశ్వస్యాధోముఖీ కిం విచరసి మనసా బాష్పపర్యాకులాక్షీ
శైథిల్యాం భూషణానాం స్వయమపి సుభగే సాధ్వవేక్షస్వ తావత్ ।
హిత్వా కూలస్థవాక్యాన్యనునయ రమణం కింవృథా ధీరహస్తైః
సంరూఢస్యాతిమూఢే ప్రణయసముదయస్యాతిమానోऽవమానః ॥

---

దూతి = దూతికా, ప్రాయః శీతాపరాధ్యా = ప్రియతముని విషయమున ఉపేక్షను వహించిన అపరాధను, అహం = నేను, పునః = తిరిగి, క్షణమపి = క్షణమైనను, న మానక్షమా = సైపలేనిదానను. అనార్యే = అనార్యురాలా, ఇదానీం = ఇప్పుడు, మాం = నన్ను, ఘోరం = ఘోరమైన, మదనతులాం = మదనుడను త్రక్కెడపై, ఆరోప్య = నిలిపి, తుష్ట భవ = సంతోషించుము.మానైకగ్రాహవాక్యైః = గౌరవము కొరకే ఉపయోగించు వాక్యములవలన, అనునయవిధురైః = వికలము చెందిన అనునయములచేత, తావకైః = వచనములచేత, మే = నాకు తత్కృతం = ఆ చేయబడినది, సంప్రతి = ఇప్పుడు,అనుచితశిథిలాం = అవసరమునకంటే మించి వదులయిన, యేన = ఎవని, పాణిభ్యాం = చేతులచేత, మేఖలాం = వడ్డాణమును, ఉద్వహామి = సరిజూచుకొనుచున్నాను.

తాత్పర్యము: హే దూతి, ప్రియుని విషయమున ఉపేక్ష వహించుటయే నా అపరాధము. కానీ ఇప్పుడు క్షణమైన నాతనిని విడువలేకుంటిని. ఇప్పుడు నీవు నన్ను ఘోరమైన కాముని తరాజుపై నిలిపి యేల ఆనందింతువు?నాపై స్నేహము లేక గౌరవభావము మాత్రముంచి, అనునయవాక్యములచే నిట్లు చేసితివి. సాధారణముగ ప్రియుడు లాగుటచే శిథిలమగు వడ్డాణము యిప్పుడు కృశత్వముచే వదులుగనైనది. దానిని నేను సమ్మాళింపవలసి వచ్చుచున్నది. (స్రగ్ధర)

ఏమంటివి – "ఇప్పుడు మదనుని చేత మానము ఓడినది. కానీ సౌభాగ్యపు అహంకారము వలన నీ మిత్రుడు కఠినుడైనాడు" అనియా. అలాగైన అభిచరమేల చేయవు? సుందరి, అటువంటి సిగ్గు వీడుము.

నిశ్వస్య = నిట్టూర్చుచున్నది, అధోముఖీ = ముఖము దించుకునినది, మనసా = మనసునందు, బాష్పపర్యాకులాక్షీ = కన్నీటి పర్యంతమైన కనులు గలదియు (అయిన నీవు) కిం = ఎందుకు, విచరసి = ఆలోచింతువు, సుభగే = సుందరి, తావత్ = ఇకపై, శైథిల్యం భూషణానాం = తెగిన అలంకారములను, స్వయమపి = నీవే, సాధు = చక్కగ, అవేక్షస్వ = చూచుకొనుము.

కిం బ్రవీషి – "స్త్రియా నామ పురుషోఽనునేయో నను శౌర్యడీర్యమ్" ఇతి | మా తావత్ | అతిమనస్విని కిం న గంగా సాగరమభియాతి? అలమలం వ్రీడయా | అథవా సకామాఽస్తు భవతీ | అహమేవ చంద్రధరమనునయామి | కిం బహునా | అద్యైవ తే చిరవిరహసమారోపితస్య మదనాగ్నిహోత్రస్య పునరాధానం కరోమి | కథమనసితబాష్పయైవ స్మితమనయా | ఇదం ఖలు వర్షర్తుజ్యోత్స్నాదర్శనమ్| సుందరి అలమలం రుదితేన | ప్రత్యుపస్థితం కల్యాణమ్ | కిం బ్రవీషి – "సత్యప్రతిజ్ఞేనేదానీం భావేన భవితవ్యమ్" ఇతి | ప్రభాతే జ్ఞాస్యసి | కథముపరతో బాష్పః | సాధయామ్యహమ్ |

(పరిక్రమ్య)

అహో ఇదమపరం శృంగారప్రకరణముపస్థితమ్ |

---

వాక్యాన్ = వాక్యములను, హిత్వా = చక్కగ కూర్చి, రమణం = ప్రియుని, అనునయ = అనునయింపుము. వృథా ధీరహస్తైః = వ్యర్థమైన చంచలమనముతో, కిం = ఏల? అతిమూఢే = మూర్ఖురాలా, ప్రణయసముదయ = ప్రణయోదయము వలని, అస్య = ఇట్టి, అతిమాన అవమానః = మిక్కిలి అభిమానముచే జనించిన అవమానము, సంరూఢస్య = పాదుకొనును.

తాత్పర్యము: నిట్టూర్చుచూ, అధోముఖి అయి, కన్నీటి పర్యంతమైన మనసు గలదానా? ఎందులకాలోచన? ఇకపై శిథిలాభరణములను సజ్జీకరింపుము. ప్రియుని చక్కగ అనునయవాక్యములచే గారవింపుము. మూర్ఖురాలా, ప్రణయోదయము వలనే రాగమెక్కువై అవమానము జరుగుట సంభవించును.

ఏమంటావు – " స్త్రీలకు పురుషులచేత అనునయింపబడుట మాత్రమే వీరత్వము" అనియా? అలా కాదు. అభిమానినీ, గంగ సాగరాన్ని చేరటం లేదా? లజ్జ చాలును. నీ ఇచ్ఛ పూర్తియగుగాక. నేనే చంద్రధరుని అనునయింతును. వేయేల? ఈ రోజే చిరవిరహతప్త అయి మదనాగ్ని యజ్ఞమును తిరిగి ప్రజ్వలింపజేతును. కన్నీటిని తుడుచుకోకయే నవ్వుచున్నావు. ఇదే కదా, వర్షాకాలచంద్రదర్శనము. సుందరి, దుఃఖమిక చాలు. కల్యాణము ముందున్నది. ఏమంటున్నావు – "పండితుని ప్రతిజ్ఞ సత్యముగావలయును" అనియా. పొద్దుట తెలుసుకోగలవు. ఎట్టు, శోకమాగినది. ఇక ఏతెంతును.

(ముందుకు నడచి)

అహో, మరల శృంగార ప్రకరణము వచ్చినది.

ఏషా హి నాగరికాదుహితా గణికా మగధసుందరీ నామ శరదమలశశిసదృశవదనా అసితమృదుకంచితస్నిగ్ధసురభిశిరసిరుహా వికసితకువలయదళలోలలోచనయుగళా విద్రుమచారుతరతామ్రాధరసంపర్కపరిపాటలదశనమయూఖా కుందకుసుమముకుళధవళసమహసితశిఖరదరీ పీనకపోలస్తనోరుజఘనచక్రా బాహ్యద్వారకవాటార్ధ సంవృత్తశరీరా దక్షిణహస్తాంగుళిద్వయేన తిరస్కరిణ్యేకదేశమవలంబమానా వామచరణకమలైకదేశేన భూతలే తాలమభిసంయోజ్య రక్తస్వరమధుర తారసంయుక్తామసంకీర్ణవర్ణామవఘుష్టాలంకారాలంకృతా శ్రోత్రమనోహరం షడ్జగ్రామాశ్రయాం వల్లభాం నామ చతుష్పదాం ఆకూజమానా నేత్రభ్రూవిక్షేపైః సంకల్పితాన్ భావానభినయంతీ కస్యాపి సుభగస్యాగమనం ప్రతీక్షమాణా తిష్ఠతి | భోః కో ను ఖల్వయం మహేంద్ర ఇవ సురతయజ్ఞాయహూయతే| భవతు | పృచ్ఛామ్యేనమ్ | భవతి, వేశమేఘవిద్యుల్లతే పృచ్ఛామస్తావత్ –

శుక్లసితాంతరక్తా సాపాంగవేక్షిణీ వికసితేయమ్ |
ధన్యస్య కస్య హేతోః చంద్రముఖి బహిర్ముఖీ దృష్టిః ||

---

ఈమెయే నాగరిక కూతురయిన గణిక మగధసుందరి యనునది. ఈమె శరత్కాలశుభ్రచంద్రవదన, నల్లనిది చిక్కనిది సౌరభములీనుచున్నది అయిన ముఖమున నొప్పు వికసితకువలయద్వంద్వములు, చంచలములైన కనులు గలది, పగడముల వలె ఎర్రని పెదవుల యందించుక దంతసంపర్కమున కిరణములు వెదజల్లెదునది, మల్లెమొగ్గల వరుసల సమముగ వెల్లనై, వాడి దంతములు గలది, చక్రవాకముల వలె పీనస్తనములు, చక్రముల వంటి నితంబములు గలది, వెలుపలి వాకిలినానుకొని యుండిన శరీరము గలది, కుడిచేతి రెండు వ్రేళ్ళచేత పరదాను పట్టుకుని యున్నది, (*ఆ రెండు లక్షణములునూ వాసకసజ్జిక యను శృంగారనాయికను సూచించునవి*) పద్మమువంటి యెడమకాలిచేత భూమిపై దరువేయుచున్నది, రక్తపల్లవములమరగిన కోకిలవలె సంయుక్తమై, (*స్థాయీ, సంచారీ, ఆరోహ, అవరోహ*) వర్ణమిశ్రమము లేక గానవిధి నెరపుచూ, శ్రోత్రమనోహరమై, షడ్జమమునాశ్రయించిన వల్లభమను చతుష్పదమును (*చతుష్పదములు పదునెనిమిది రకములని మానవల్లిరామకృష్ణకవి భరతకోశమున వివరించెను*) యించుక గానము చేయునది, నేత్ర భ్రూ విక్షేపములతో భావములనభినయించునది, ఎవడో సౌభాగ్యవంతుని రాకకెదురుచూచునదిగ నున్నది. ఆహా, సురతయజ్ఞమునకు ఆహూతుడైన ఆ మహేంద్రుడెవడు?(*ఇచ్చట మహేంద్రశబ్దము గుప్తరాజు కుమారగుప్తుని సూచించునని కొందరు*) కానిమ్ము. ఆమెను అడుగుదును. ఓ వర్షాకాలమేఘము యొక్క మెరుపా! అడుగుచున్నాను –

శుక్లా = తెల్లని, అసితా = నల్లని, అన్తరక్తా = కోణమున ఎరుపురంగు, వికసితా = బాగుగా తెరిచి, సాపాంగవేక్షిణీ = క్రీగంట చూచునదైన అయం చంద్రముఖీ = ఈ చంద్రముఖి, కస్య ధన్యస్య = ఏ ధన్యునియొక్క, హేతోః = కారణాన, దృష్టిః = దృష్టి, బహిర్ముఖీ = బయట నిలుపునది?

తాత్పర్యము: తెలుపు (కనుపాప), నలుపు (కను గుడ్డు), ఎరుపు (కనుచివర) ల కనుల ఈ సుందరి తన వికచనేత్రములతో క్రీగంట , ఏ ధన్యునికై బయట ఎదురుచూచునది?

హా ధిక్ విస్రస్తమృగపోతికేవ సంత్రస్తయా దృష్ట్యా మాం నిరీక్షతే | ప్రత్యాగతచిత్తయానయా భవితవ్యమ్ | కిం బ్రవీషి – " మా మైవమ్ | బ్రహ్మచారిణీ ఖల్వహం వసంతముపవాసామి" ఇతి | శ్రద్ధేయమేతత్ | అయమిదానీం సరసదంతక్షతోऽధరోష్ఠః కిమితి వక్ష్యతి? కిం బ్రవీషి – "సావశేషతుపారపరుషస్య వసంతవాయోః పదాన్యేతాని" ఇతి | భవతు తావత్ | సంజ్ఞాప్తాః స్మః |

దంతజర్జరోష్ఠీ
యథా చ నియమం త్వమాత్మనో వదసి |
సువ్యక్తమవ్రతఘ్నం
చుంబితచాంద్రాయణం చరసి ||

ఏషా సంవృత్య కవాటేన ముఖం ప్రహసితా | తపోవృద్ధిరస్తు భవత్యై | సాధయామ్యహమ్ | (పరిక్రమ్య)

---

హా, ధిక్ – భయమందిన లేడిపిల్ల వలె త్రాసమునొందిన దృక్కులతో నన్ను చూచుచున్నది. ఈమె మనమున తిరిగి రాగముదయించినది. ఏమంటున్నావు – " అదేమీ లేదు. బ్రహ్మచారిణి అయిన నేను వసంతమున ఉపవాసమొనర్చుచున్నాన"నియా. మంచి శ్రద్ధయే. " కానీ ఇప్పుడు పెదవిపై సరసమైన పంటినొక్కు ఏమి చెప్పుచున్నది? ఏమంటావు – "మిగిలిన మంచు కణములు గల వసంతవాయువుల చిహ్నములు ఇవి" అనియా. అలాగే కానిమ్ము. మాకు తెలిసినది.

దన్తపదజర్జరోష్ఠీ = దన్తక్షతముచేత జర్జరితమైన పెదవిగలదానా, యథా = ఎలాగున త్వం = నీవు, ఆత్మనః నియమం = నీ నియమమును, వదసి = చెప్పుచున్నావో, సువ్యక్తమవ్రతజ్ఞం = ఆ వ్రతప్రకారమే, చుంబితచాంద్రాయణం = చుంబనముల చాంద్రాయణమును, చరసి = నెరపుచున్నావు.

తాత్పర్యము: దన్తక్షతము చేత కమిలిన పెదవిగలదానా, నీ నియమముననుసరించి చాంద్రాయణవ్రత మొనర్చుచుంటివి కాబోలును.

*విశేషము: చాంద్రాయణవ్రతమన, నాలుగు నెలలు జరుపునది. ఈ నాలుగు నెలలందు పాడ్యమి మొదలుకుని పౌర్ణమి వరకునూ, మొదటి దినమున నొక్క అన్నపు ముద్దతోనారంభించి, దినమునకొక్క కబళమును పెంచుట, పౌర్ణమి తర్వాత అమావాస్య వరకు నొక్కొక్క కబళమును తగ్గించుకొనుచూ వచ్చుట సాంప్రదాయము. ఈ ఉపవాసము వలె నీ కన్నియయూ సురతోऽపవాసము చేయుచున్నదని వ్యంగ్యము.*

వాహ్, కిటికీ వెనుక ముఖమును దాచి నవ్వుచున్నది. నీకు తపోవృద్ధి యగుగాక. మేమిక నేగుదుము. (ముందుకు నడచి)

భోః ఏష కథంచిత్ వేశ్యయువతిప్రలాపశృంఖలాన్మున్ముచ్య ప్రాప్తోऽస్మి దేవదత్తాయా గృహమ్ | అపిదానీం దేవదత్తా గతా స్యాత్ | కిం ను ఖలు పృచ్ఛేయమ్ | (విలోక్య) ఆ అయం తావద్ వృక్షవాటికాపక్షద్వారేణాతిక్రామతి భావగంధర్వదత్తస్య నాటకాచార్యస్యంతేవాసీ దర్దురకో నామ నాటేరకః | యావదేనం పృచ్ఛామి |

(నిర్దిశ్య)

అంఘో దర్దురక కుతస్త్వమాగచ్ఛసి? అపి జానీషే కిం దేవదత్తా కరోతీతి? కిమాహ భవాన్ – "గతా ఖలు దేవదత్తా సుఖప్రశ్నార్థమార్యమూలదేవం ద్రష్టుమ్ | అహం తు దేవసేనాం ద్రష్టుమాచార్యేణ ప్రేషితోऽస్మి" ఇతి | అథ కేన కారణేన ? కిం బ్రవీషి – "కుముద్వతీభూమికాప్రకరణముపనయేతి" ఇతి | అథోపనీతం పత్రకం గృహీతం చ తయా? కిం బ్రవీషి – "ఆచార్యగౌరవాత్ ప్రతిగృహీతం తత్పత్రకం తయా | పార్శ్వస్థాయాస్తు సఖ్యా హస్తే న్యస్తమ్ | అపి చ కుముద్వత్యై నమస్కృత్యోక్తవతీ – 'అస్వస్థా తావదసి' ఇతి" ఇతి |

హన్త ప్రసిద్ధతర్కాః స్మః | ఏతదస్యాః కామైకతానతాం సూచయతి | అంఘో దర్దురక కిమిదం పత్రకేऽభిలిఖితమ్ ? కిం బ్రవీషి – "వాచయస్వ" ఇతి | (గృహీత్వా వాచయతి)

---

ఆహా, ఏలాగునో వేశ్యాయువతుల ప్రలాపముల సంకెలలను వీడి దేవదత్త ఇంటికి చేరితిని. దేవదత్త ఇంట లేదు కాబోలు. కానీ అడిగెద గాక. (చూచి)ఆ, వృక్షవాటిక దిశగానున్న ద్వారము వైపు నుండి గంధర్వదత్తనాట్యాచార్యుని శిష్యుడు దర్దురకుడను నటుడు వెడలుచున్నాడు. అతనిని అడిగెదను.

(సైగ చేసి)

అహో దర్దురక, ఎచటి నుండి రాక? దేవదత్త ఏం చేస్తోందో తెలుసా? ఏమన్నావూ – " దేవదత్త మూలదేవుని కుశలమడుగుటకై వెళ్ళినది. నేను ఆచార్యుడు పంపగా దేవసేనను చూచుటకు వచ్చితి" ననియా. ఏ కారణాన? ఏమంటున్నావు – "కుముద్వతి అనే పాత్ర గురించిన లిపిపత్రమొసగుటకు" అనియా. ఆ లిపి పత్రము ఇచ్చితివా? ఆమె పుచ్చుకున్నదా? ఏమంటావు – " ఆచార్యునిపై గౌరవము వలన ఆమె ఆ పత్రమును తీసుకొన్నది. కానీ పక్కన ఉన్న చెలికత్తె చేతికిచ్చినది. ఆపై కుముద్వతికి నమస్కరించి యన్నది – 'నేనిపుడు అస్వస్థనయి ఉన్నాను'" . అనియా.

అహో, మేమూ మా అనుమానమునకై ప్రసిద్ధులమే. అరే, దర్దురక. పత్రమున వ్రాసినదేమి? ఏమందువు – "చదువుకొమ్మ"నియా. (తీసుకొని చదువును)

కాన్తం కందర్పపుష్పం స్తనతటశశినం రాగవృక్షప్రవాళం
శయ్యాయుద్ధాభిఘాతం సురతరథరణశ్రాన్తధుర్యప్రతోదమ్ |
ఉన్మేషం విభ్రమాణాం కరజపదమయం గృహ్యసంభోగచిహ్నం
రాగాక్రాన్తా వహన్తాం జఘననిపతితం కర్కశాః స్త్రీకిశోర్యః ||

సాధు భోః కర్కశస్త్రీకిశోరప్రతారణయాభిప్రస్థితస్య మే | మహదిదం మంగళమర్థసిద్ధిం సూచయతి | అఘో దర్దురక, అపి జానీషే కుత్రస్థా దేవసేనేతి? కిం బ్రవీషి – "వృక్షవాటికాం గతా" ఇతి | మదనకర్మాంతభూమౌ వర్తతే| సాధు | గచ్ఛతు భవాన్ | ప్రవిశామస్తావత్ | (ప్రవిశ్య) అయే, ఇయమియం దేవసేనా –

---

కాన్తం = సుందరిని, కందర్పపుష్పం = మన్మథుని కుసుమమును, స్తనతటశశినం = స్తనతటమున గల అర్ధచంద్రరూపమున నఖక్షతమును ధరించిన దానిని, శయ్యాయుద్ధాభిఘాతం = పడకటింటిపోరున దెబ్బతిన్నదానిని, సురతరథరణశ్రాన్తధుర్యప్రతోదం = సురథరూప రథయుద్ధమున అలసిన యెద్దులకై అంకుశము గలదానిని, ఉన్మేషం = మేల్కాంచినదానిని, విభ్రమాణాం = విభ్రమములైన, కరజపదమయం = చేతి వ్రేళ్ళ చిహ్నములచే, గృహ్యసంభోగచిహ్నం = స్వీకరింపబడిన సంభోగచిహ్నములదాని, రాగాక్రాన్తా వహన్తాం = ఎరుపురంగునొందినదానిని, జఘననిపతితం = నితంబములపై పడినదాని, కర్కశాః = కర్కశమైన స్త్రీకిశోర్యః = స్త్రీ కిశోరమును..

తాత్పర్యము: మన్మథుని కుసుమమును, స్తనతటమున గల అర్ధచంద్రరూపమున నఖక్షతమును ధరించిన దానిని, పడకటింటిపోరున దెబ్బతిన్నదానిని, సురథరూప రథయుద్ధమున అలసిన యెద్దులకై అంకుశము గలదానిని, మేల్కాంచినదాని, విభ్రమములైన, చేతి వ్రేళ్ళ చిహ్నములచే, స్వీకరింపబడిన సంభోగచిహ్నములదానిని, ఎరుపు రంగునొందినదానిని, నితంబములపై పడినదాని, కర్కశమైన స్త్రీ కిశోరమును..సుందరిని

*విశేషములు: స్రగ్ధర. స్తనతటశశి: అర్ధచంద్ర, మండల, మయూరపద, దశప్లుత, ఉత్పలపత్రమను నైదు చిహ్నములచే నఖక్షతముండును. ఇక్కడ అర్ధచంద్రనఖక్షతము వర్ణితము. ఈ పద్యము దర్దురకుని చేతి నుండి పత్రలు లాగికొని చదివినది కావున, ప్రకరణమధ్యమున గల పద్యము వలెనున్నది.*

బాగు. స్త్రీరూపముననున్న ఆ కర్కశకిశోరిని సాధించుటకై వచ్చిన నాకు కార్యసిద్ధి సూచనమగు శకునము దొరకుచున్నది. అరే దర్దురక, దేవసేన ఎక్కడ ఉందో తెలుసునా? ఏమంటివి –" ఉద్యానవనమున కేగెన"నియా. కామదేవుని కర్మ భూమికేగినది. సొబగు.

అక్కడికేగుదును. (ప్రవేశించి)అరే ఇదిగో దేవసేన.

కృశా వివర్ణా పరిపాణ్డునిష్ప్రభా ప్రభాతదోషోపహతేవ చంద్రికా |
వహత్యసాధారణగూఢవేదనం మనోమయం వ్యాధిమదారుణౌషధమ్ ||

ఆ యథైవం సర్వగుహ్యధారిణ్యా స్నేహాతిసృష్టసఖీభావయా ప్రియవాదినికయా నామ పరిచారికా సహ పరివర్జితాన్యజనా వాయుం పర్యుపాసతే | భవతు | ఏతదప్యస్యా ఏకతాఅతాం సూచయతి | సర్వోఽపి వివిక్తకామః కామీ భవతి | అస్మద్విషయగతేయమ్ | యావదేనాముపసర్పామి | (ఉపేత్య)

వాసు దేవసేనే విస్రంభాలాపవిచ్ఛేదకారిణే న ఖలు వయమసూచితవ్యాః | కిం బ్రవీషి – "స్వాగతం భావాయ | అభివాదయామి" ఇతి | భవతు | ప్రతిగృహీతః సముదాచారః | అలమలం ప్రత్యుత్థానయంత్రణయా | కిమాహ భవతీ – "ఉపవిశ, ఇదమసనమ్" ఇతి | బాఢముపవిష్టోఽస్మి | వాసు కిమిదం బంధుజనసంతాపః క్రియతే ? కో నామాయమచక్షుర్గ్రాహ్యో గూఢవేదనః స్వయంగ్రాహ్యః ప్రాక్ కేవలో వ్యాధిః | కిం బ్రవీషి – " న ఖలు కించిత్" ఇతి | అపి పండితమానిని అలమస్మాన్ విక్షిప్య | సదాఽపి నామ త్వమస్మాకం బాలక్రీడనకాన్వేషణాదిషు ప్రణయవతీ | అపి చ, స ఏవాయం మూలదేవసఖః శశః | తదుచ్యతాం సద్భావః | కిమాశ్రయోఽయం సంతాపః ? తవ హి –

---

కృశా = చిక్కినది, వివర్ణా = పాలిపోయినది, పరిపాణ్డు నిష్ప్రభా = బాగా తెల్లనై, కాంతి కోలుపోయినది, ప్రభాతదోషోపహతా ఇవ చంద్రికా = ప్రభాత కాలమున దోషమునందిన చంద్రుని వలెనున్నది, అసాధారణ గూఢవేదనం = అసాధారణమైన తెలియని వేదనను, మనోభయం = మనసునందలజడిని, వ్యాధిం = వ్యాధిని, దారుణౌషధం = దారుణౌషధమును వహతి = వహించినది.

తాత్పర్యము: చిక్కి, పాలిపోయి, ప్రభాతచంద్రుని వలె వెలవెలబడి, తెలియని వేదనతో, మనసునందలజడిని, మదనవ్యాధిని, ఔషధమును వహించినది. (వంశస్థవృత్తము – జ, త, జ, ర)

అహో, ఆ కారణముననే, తన రహస్యములన్నీ తెలిసిన చెలి ప్రియవాదినిక తో కలిసి, ఏకాంతమున గాలి భోంచేస్తున్నది. ఈమెయందూ ఏదో ఒక విషయమున నాసక్తి కనిపించుచున్నది. కామినులందరూ ఏకాంతము నాస్వాదింతురు. ఇప్పుడు విషయము నా స్వాధీనమందున్నది. ఆమె కడకేగుదును (సమీపించి)

బాలా, దేవసేనా. నీ వ్యక్తిగత విషయములందు పాల్గొను మా వలన నిరాశనొందకుము. ఏమంటున్నావు – "ఆర్యులకు స్వాగతము. నమస్సులు" అనియా. నీ గౌరవము స్వీకరించితిమి. పర్వాలేదు. లేవనవసరము లేదు. " ఇదిగో ఆసనము కూర్చొనుడి" అంటివా. ఆహా, కూర్చుంటిని. బాలా, ఏల ఇలా బంధుజనులకు సంతాపము కలిగింతువు? కనులలో తెలియబర్చక, తెలియని వేదనతో, నీవే అలమటించుచు, ఏకాంతమున వసించు వ్యాధి ఏమి?" అదేమీ లేదు" అనుచున్నావా? పండితయువతీ, నా వద్ద దాచినది చాలు. నీవు నాకు ఎప్పుడునూ చిన్నపిల్లవే. బొమ్మలు తెమ్మని నన్ను అడుగుతూ ఉండేదానివి కూడా. నేను మూలదేవుని మిత్రుడైన శశుడను. కావున సద్భావమున చెప్పుము. ఈ నీ దుఃఖకారణమేమి? నీకు –

అవ్యాధిగ్లానమంగం కరతలకమలాపా్రిశితం గండపార్శ్వే
దృష్టిర్యానైకతానా జడమివ హృదయం జృంభణా వర్ణభేదః |
నిశ్వాసాయాసకర్తా న చ న రతికరస్తాపనశ్చేంద్రియాణా-
మేకద్రవ్యాభిలాషీ ప్రతినవ ఇవ తే చోరి కోయం వికారః ||

కథం నిశ్వసితమనయా | హన్త సంధుక్షితో మదనాగ్నిః | భవతు | ఇదానీమాత్మగతం భావమస్యా జ్ఞాస్యామః | యది వయమపాత్రీభూతా విస్రంభానామరోగాస్తు భవతీ | సాధయామ్యహమ్ | కిం బ్రవీషి – "చపలం ఖలు భావః" ఇతి | హన్త ప్రతిజ్ఞాతమ్ | ఏషాఽపి మర్మ వక్ష్యతి | వాసు కుతో మే ధృతిస్తవేదృశేన శరీరోదంతేన | అపి చ దీర్ఘసూత్రతా నామ కార్యాంతరముత్పాదయతి |తదుచ్యతాం సంతాపకారణమ్ | కిం బ్రవీషి –" న ఖలు మే భావం ప్రతి గుహ్యమస్తి | అయం తు వసంతస్వభావః యన్మే గురుజనయంత్రణయా నిభృతస్యాపి మనసః కిమప్యకారణేనౌత్సుక్యముత్పాదయతి" ఇతి | సాధు భో నాయం వ్యాధివ్యపదేశః | చోరి, ఏతదపి జానీషె సాధు యువతీ ఖలు దేవసేనా సంవృత్తేతి |

---

అవ్యాధిగ్లానమంగం = వ్యాధిలేకయే అలసిన అంగములను, గణ్డపార్శ్వే = చెక్కిళ్ళలో, కరతలకమలా = కరతలమనెడి కమలముల, అపాశ్రితం = నీటిని ఆశ్రయించి, దృష్టిః = చూపు, నా ధ్యాన ఏకతా = శూన్యమున మరల్చిన, హృదయం = హృదయము, జడం ఇవ = స్పందన లేక,వర్ణభేదః = నానా వర్ణములు, జృంభణా = మిక్కిలిగయైనవై, నిశ్వాస ఆయాసకర్తా = శ్వాస కూడా ఆయాసమును కలిగించుచున్నదిగా, ఇంద్రియాణాం చ = ఇంద్రియములలోనూ, న రతికరస్తాపనా = ఏ విధమైన అనురక్తి లేకుండగా, న ఏక ద్రవ్యాభిలాషీ = ఒక్క వస్తువుపైనాశ లేక, ప్రతినవ ఇవ = కొత్తకొత్తగ వలె, చోరి = చోరీ, తే = నీకు. కః ఇయం = ఏదిది, వికారః = వికారము?

తాత్పర్యము: వ్యాధి లేకయే అలసట, చెక్కిలికి చేర్చిన కమలహస్తముల నీరు, శూన్యపు దృక్కులు, స్పందన లేని హృదయము, పలువర్ణముల జృంభణము, శ్వాస ఆయాసముగనుండుట, ఇంద్రియములలో అనురక్తి లేకుండుట, ఒక్క వస్తువుపైనాశ లేక, నీ ఈ వికారమెద్ది? స్రగ్ధరావృత్తము.

ఈమె ఇలా నిట్టూరుస్తున్నదెందుకు? ఈమె కామాగ్ని జ్వలితమైనది. కానిమ్ము. ఈమె ఆత్మగతభావమును తెలుసుకొనెదను. నేను నీ విశ్వాసపాత్రుడను గానిచో సరే, సుఖముగనుండుము. నేను మరలెదను. ఏమంటివి – "ఆర్యులు చపలురు" అనియా. హో, తెలిసినది. ఈమె మర్మముగ చెప్పదలుచుకున్నది. బాలా, నీ ఈ పరిస్థితి చూచి నాకెలా ధైర్యము కలుగును? ఇంకనూ ఆలసించిన ఇంకొక పని ఎదురు వచ్చును.

కావున సంతాపకారణము జెప్పుము. ఏమంటివి – " మీ వద్ద నేను దాచినదేమి లేదు. ఈ వసంతకాలపు స్వభావమేమనగా, అతి పెద్ద శిక్ష విధించి మనస్సును కారణము లేకనే వశపర్చుకొనును" అనియా. బాగు, ఈమె వ్యాధి లేదని చెప్పుట లేదు. చోరి, దేవసేన యువతి ఐనదని ఎరుగుదువా?

వాసు యద్యేవం అలమలమనుబంధేన | ఋతుపరిణామేన స్వస్థా భవిష్యసి | కథం వ్రీడితమనయా | ప్రియవాదినికే, కిమిదం తాళపత్రేऽభిలిఖితమ్ ? కిం బ్రవీషి – "నాటక భూమికా" ఇతి | పశ్యామస్తావత్ |

(గృహీత్వా వాచయతి)

కుముద్వతీ ప్రకరణే శూర్పకసక్తాం రాజదారికాం ధాత్రీ రహస్యుపాలభతే |

ఉన్మత్తే నైవ తావత్స్తనవిషమమురే నోద్గతా రోమరాజిః
న వ్యుత్పన్నాऽసి చ త్వం వ్యపనయ యువతీదోహలం దుర్విదగ్ధే |
వ్యుత్పన్నాభిః సఖీభిః సతతమవినయగ్రంథమధ్యాప్యసే త్వం
కేనేదం బాలపక్వే మనసిజకదనం కర్తుమభ్యుద్యతాసి ||

---

బాలా, అలాగయిన ఈ వ్యాధినిక ఉపేక్షింపకుము. ఋతువు మారినంతట నీవు ఆరోగ్యవంతురాలవగుదువు. సిగ్గేల? ప్రియవాదినికా, ఈ తాళపత్రమున వ్రాసినదేమి? ఏమంటివి – "నాటకభూమికా" అనియా. దానిని చూడనిమ్ము.

(తీసుకుని చదువును)

'కుముద్వతీప్రకరణమున శూర్పకుని యందాసక్త అయిన రాజపుత్రి రహస్యమున కలియును'

ఉన్మత్తే = తెలియని దానా, తావత్ = అంతవరకు, ఉరౌ = ఛాతియందు, నైవ స్తనవిషమం = స్తనముల అమరిక లేదు. రోమరాజిః = నూగారు, నోద్గతా = వచ్చి ఉండలేదు. అపి చ = ఇంకనూ, త్వం = నీవు, న వ్యుత్పన్నా అసి = యౌవని అయి ఉండలేదు. దుర్విదగ్ధే = తెలివి లేని దానా, యువతీదోహలం = యువతుల (పతుల పట్ల) ఉత్సాహమును, వ్యపనయ = తొలగించుము. త్వం = నీవు, వ్యుత్పన్నాభిః = చదువుకున్న. సఖీభిః = చెలుల వలన, సతతం = ఎప్పుడూ, అవినయగ్రంథం = నీకు మాలిన గ్రంథములను, అభ్యాప్యసే = చదివింపబడుచున్నావు, కేన = ఎందుకు? ఇదం = ఇప్పుడు, బాలపక్వే = బాలభావమున పండి, మనసిజకదనం = మన్మథయుద్ధమును, కర్తుం = చేయుటకు, అభ్యుద్యతా = సమాయత్తవై, అసి = ఉన్నావు.

తాత్పర్యము: మూఢురాలా, బాలగా ఉన్నంతవరకూ నీ స్తనములుదయించలేదు. నూగారు లేదు. యౌవనివి కావు. నీ సఖులు నేర్పించినవి, నీకు సరిపడనివి అయిన గ్రంథములు చదివి, భర్తల పట్ల పాతివ్రత్యమును యువతుల ఉత్సాహమును పొందకుము. ఇప్పుడు నీవు తరుణవు. ఇప్పుడు నీవు కామభోగములనాశింపదగును. స్రగ్ధరా వృత్తము. (గణములు: మ ర భ న య య య)

కిమాహ దేవసేనా – "ఏతత్తావన్మయైవ న శ్రుతమస్తి" ఇతి | హన్త ఏష ఉద్గీర్ణః స్వభావః | ఇత్థమహమపి కామయామీత్యుక్తం భవతి | కిమాహ దేవసేనా – "ఛలగ్రాహీ భావః" ఇతి | వాసు అలమలమస్మాన్ విక్షిప్య | మేధావిగూఢమపి చంద్రమసం కుముద్వతీప్రబోధః సూచయతి | గచ్ఛ పురుషద్వేషిణి | ఆపన్నేదానీమసి |

నైవాహం కామయామీత్యసకృతభిహితం అత్త్వయా గూఢభావే
సా త్వం తన్వీస్వభావాత్ కథయ తనుతరా చోరి కేనాసి జాతా |
హస్తప్రత్యస్త గణ్డే ప్రశిథిలవలయే భిన్ననిఃశ్వాసవక్త్రే
వ్యాధిక్లిష్టో జనోఽయం కిమిదమతిశఠే వాహ్యతే ధీరహస్తః ||

కిమాహ ప్రియవాదినికా – "సతి ప్రవృత్తే కామతంత్రప్రకరణే దిష్ట్యేదానీమస్మత్స్వామినీ పురుషవిశేషమనురక్తా, న పృథగ్జనమ్" ఇతి | తత్కస్యామవన్తినగర్యో పురుషవిశేషశబ్దః ప్రచరతి ? కిమాహ భవతీ – "కస్య తావత్త్వయాఽభ్యుపగమ్యతే" ఇతి | కస్యాన్యస్య, నను కర్ణీపుత్రస్య | స హి |

---

దేవసేన ఏమన్నది – "ఇది నేనూ వినలేదు" అనియా. హో, ఈమె భావమెరిగితిని. నేనూ అలా చేసెదనని ఈమె భావము. దేవసేన ఏమనును – "నా ఆలోచనను ఆర్యులు గ్రహించిరి" అనియా. బాలా, నా దగ్గర దాచినది చాలు. మేఘములలో దాగిన చంద్రుడైనా కలువను వికసింపజేయును. వెళ్ళు పురుషద్వేషిణి. నీకిక మంచి జరుగు.

గూఢభావే = గోప్యమైన భావములదానా, యత్ త్వయా = ఏది నీచేత, నైవ అహం కామయామి = నేను కోరుకొనలేదు, ఇతి = అని, అసకృత్ = అబద్ధపు, అభిహతం = చెప్పబడినది (కలదో), సా = అది, చోరి = చోరురాలా, తన్వీస్వభావాత్ = కన్యా స్వభావమువలన, త్వం = నీవు, తనుతరా = లావుగ, కేన జాతా అసి = ఎందుకయినావు, కథయ = చెప్పుము. హస్తప్రత్యస్తగణ్డే = చెక్కిలిపై చేయిచేర్చిన దానా, ప్రశిథిలవలయే = చిక్కిన నడుము దానా, భిన్ననిఃశ్వాస వక్త్రే = వివర్ణమై, నిట్టూర్పుల ముఖము గలదానా, అతిశఠే = మిక్కిలి ధూర్తురాలా, అయం = ఈ, వ్యాధిక్లిష్టః జనః = మదనవ్యాధి పీడితమైన జనము, కిమిదం = ఏల ఈ, ధీరహస్తః = ధీరుని హస్తము, వాహ్యతే = వీయబడుచున్నది?

తాత్పర్యము: గూఢభావములదానా, "నేను కామవశ కాలేదు" అని చెప్పిన చక్కని తనువు గల నీవు బెంగచేత నడుము చిక్కి, ముఖమున నిట్టూర్పులిడుచు, చెక్కిలిపై చేయి జేర్చి, ఒకింత ఒళ్ళు జేసి, ఏలనున్నావు? మిక్కిలి శఠురాలా! ఈ మదనవ్యాధినందిన నీవు ధీరహస్తునికై ఎదురు చూచుచునే ఉన్నావు.

ప్రియవాదినిక ఏమన్నది? – " కామతంత్రప్రకరణమున ప్రవృత్త యైన నా స్వామిని యొక విశేషపురుషుని మీద మరులుగొన్నది, సాధారణ యువకుని మీద గాద" నియా. ఈ అవంతీనగరమున విశేషపురుషుడెవ్వడు? "ఎవరో మీరే చెప్పుము?" అంటున్నావా? ఇంకెవరు? కర్ణీపుత్రుడే. అతడే –

కులే ప్రసూతః శ్రుతవానవిస్మితః
స్మితాభిభాషీ చతురో విమత్సరః |
ప్రియంవదో రూపవయోగుణాన్వితః
శరీరవాన్ కామ ఇవాऽధనుర్ధరః ||

కిం అధోముఖీ దేవసేనా సంవృత్తా | అలమలమనిభృతే దుకూలదశాన్తోద్వేష్టనేన | కథ్యతాం తావత్ | అపి చ యది వయం భాజనీభవిష్యామః సమౌనమేవాస్తే | అథవా లజ్జా నామ విలాసయౌతకం ప్రమదాజనస్య, విశేషతశ్చాప్రౌఢకామినీనామ్ | తదేషా కథమివ స్వయం వక్ష్యతి | తత్కామం పురుషవిశేష ఇత్యసాధారణ ఏవ శబ్దః కర్ణీపుత్రే ప్రతివసతి | తథాపి నామ త్వలబ్ధగాంభీర్యో ధృతిముపయాత ఏనాం వ్యాహారయామి |

వాసు దేవసేనే కిమస్మాకం పరరహస్యశ్రవణేన ? ఉదాసీనః ఖలు వయమ్ | తదామంత్రయే భవతీమ్ | కర్ణీపుత్రోऽపి పాటలీపుత్రవిరహాత్ స్వజనదర్శనోత్సుకో భృశమస్వస్థః | స ఏషోऽద్య శ్వో వా ప్రస్థాయతే | పునర్ద్రష్టాస్మి భవతీమ్ | కింతు స్వస్థరూపయా తయా భవితవ్యమ్ | స్మర్తవ్యాః స్మో వయమ్ |

---

కులే ప్రసూతః = కులీనుడు, శ్రుతవాన్ = విద్వాంసుడు, అవిస్మితః = తొణకనివాడు, స్మితాభిభాషీ = నవ్వుతూ మాట్లాడువాడు, చతురః = చతురుడు, విమత్సరః = మత్సరము లేనివాడు, ప్రియంవదః = మృదుభాషణుడు, రూపవయోగుణాన్వితః = రూపము, వయస్సు, గుణములతో కూడినవాడు, శరీరవాన్ = శరీరము కలిగిన, అధనుర్ధరః కామః = ధనువులేని మదనుడు.

తాత్పర్యము: కర్ణీపుత్రుడు కులీనుడు, పండితుడు, గంభీరుడు, స్మితభాషి, చతురుడు, మాత్సర్యము లేనివాడు, మృదుభాషణుడు, రూపయౌవనగుణసంపన్నుడు, శరీరమున్ననూ, ధనుస్సు లేని మన్మథుడు.

*విశేషము: కర్ణీసుతుని వర్ణన ఇది. ఈతడు సంస్కృతసాహిత్యంలో పలుచోట్ల కనిపిస్తాడు. (మున్నుడి). వంశస్థవృత్తము. జతౌ తు వంశస్థముదీరితం జరౌ – అని వంశస్థవృత్తసూత్రము.*

దేవసేన ముఖము దించుకున్నదేమి? మేలిముసుగు అంచు ను వ్రేలికి చుట్టుట ఆపుము. అయినచో వివరింపుము. మేము విశ్వాసపాత్రులని నెంచియూ మౌనమే వహించుచున్నావు. లేదా యువతులకు అందున ప్రౌఢకామినులకు లజ్జయే అరణము. ఎలా చెప్పగలవు మరి? అదికాక, 'పురుషవిశేష' మను అసాధారణశబ్దము కర్ణీపుత్రునికే చెందినచో, అప్పుడు గాంభీర్యము పొందని నీకై, దిట్టతనము నొందునట్లు అతనిచే వ్యవహరింపజేతును.
బాగు దేవసేనా, ఇతరుల రహస్యములు వినుటలో నాకేమి ప్రయోజనము? మేము ఉదాసీనులము. కేవలము నీకు ఉపాయము చెప్పెదము. కర్ణీసుతుడునూ, పాటలీపుత్రమును విడచుటవలన, తన స్వజనులను చూచుట యందు ఉత్సుకుడై అస్వస్థుడాయెను. అతడు నేడో, రేపో బయలుదేరును. నిన్ను తర్వాత కలిసెదను. కానీ నీవు ఆరోగ్యవంతురాలవు కావలెను. నన్ను గుర్తుంచుకొనుము.

(ఉత్థాయ ప్రస్థితః | సత్వరం నివృత్య) అయే కేనైతదుక్తం – "హన్త వ్యాపన్నేదానీమ్" ఇతి | ఆ దేవసేనా రోదితి | వాసు కిమిదమ్, అలమలం రుదితేన | భవతు | గృహీతామ్ | దిష్ట్యా పాత్రగతో మనోరథః కర్ణీపుత్రస్యాపి త్వన్మయ ఇవ వ్యాధిః | తదితరేతర–స్యౌషధత్వేన కల్పయితవ్యమ్ | కిం బ్రవీషి – "కిముచ్చైః కథయసి | దుఃఖశీలః ఖలు భావ" ఇతి | అలమలం యన్త్రణయా —

దక్షాత్మజః సున్దరి యోగతారాః కిం నైకజాతాః శశినం భజన్తే |
ఆరుహ్యతే వా సహకారవృక్షః కిం నైకమూలేన లతాద్వయేన ||

కిం బ్రవీషి – "తథేదానీం సంప్రధార్యతాం యథోభయం రక్ష్యతే" ఇతి | అథ కిమ్ | సంప్రధారితమేవైతత్ | శ్వః కిల ఏ భగినీ యథోచితమాచార్యగృహం నృత్తవారేణ యాస్యతి | తతో లబ్ధాన్తరవిస్రంభా సుభగే సుఖప్రశ్నవ్యాహారవ్యాజేన | త్వం వా తత్ర యస్యసి స వేహాగమిష్యతి | కిమియం విమర్శదోలా వాహ్యతే ?

---

(లేచి బయలుదేరును. కానీ మరల వచ్చి)

అరే, ఎవరిలా అన్నది – " హా! నాకిక చావే గతి!" అని. ఆ, దేవసేన యేడ్చుచున్నది. ఇప్పుడేమిటిది, శోకము చాలును....సరిసరి, అర్థమయినది...నీ మనోరథము యోగ్యమైనదే. కర్ణీపుత్రునికీ ఇదే వ్యాధి ఉన్నది. మీరిద్దరూ ఒకరికొకరు వైద్యం చేసుకోవలెను కాబోలు. ఏమందువు? " పెద్దగా దేనిని వివరించుచున్నావు? ఆర్యుడు కర్ణీపుత్రుడు దుఃఖభాజనుడ"నియా? ఆలోచించుట చాలు.

సుందరి = ఓ సుందరీ!, దక్షాత్మజాః = దక్షపుత్త్రికలు, యోగతారాః = తారలు కలిసి, ఏకజాతః = ఒకడేయైన, శశినం = చంద్రుని, కిం న భజన్తే = పూజింపరా? న ఏకమూలేన = ఒకే మూలము కాని, లతాద్వయేన = రెండు తీవెలచేత, సహకారవృక్షః = మామిడిచెట్టు, నా ఆరుహ్యతే వా కిమ్? = అల్లుకొనబడుటలేదా ఏమి?

తాత్పర్యము: ఓ సుందరీ! తారలందరు కలిసి ఒక్కచంద్రుని అర్చింపరా? ఒకే మూలము లేని రెండు లతలు మామిడిచెట్టును అల్లుకొనదా?

*విశేషములు: నిదర్శనాలంకారము. ఇంద్రవజ (స్యాదింద్రవజా యది తౌ జ గౌ గః .ప్రతి పాదమునా రెండు త గణములు, జ గణము, రెండు గురువులు)*

ఏమనుచున్నావు?–"అందుకే ఇక నిద్దరు రక్షింపబడునట్లు ఉపాయమాలోచింపుము" అనియా. మరి కాదా? ఇదంతయూ ఆ అలోచనయే. రేపు నీ సోదరి యథోచితముగా ఆర్యుని (కర్ణీసుతుని) గృహమునకు నృత్తవారాదులతో వెడలును. అప్పటికి నీ అంతః కరణమును చక్కగ మార్చుకుని తరుణీ, నీవు కుశలప్రశ్నలవ్యాజమున అచ్చటకు వెళ్ళుము, లేదా అతడు ఇక్కడికి వచ్చును. ఏల

డోలాయమానమానసమున సంశయించుచున్నావు?

కిమాహ ప్రియవాదినికా – "న మమేహార్యపుత్రస్యాగమనం రోచతే | యథాऽత్ర భవత్యాస్తత్ర గమనమ్ | గణికాజనో నామ పైశున్యప్రాభృతైషా జాతిః |

తస్మాదహమేవాస్యా యథోచితం యోజయిష్యామి యథా నృత్తవారాత్ ప్రస్థితాద్య దేవదత్తా స్వయమ్ | ఏవ మమ స్వామినీం సుఖప్రశ్నాగమనేనార్యమూలదేవసకాశమనునేష్యతి |" సాధు ప్రియవాదినికే ఇదానీం ఖలు యథార్థానామతా | ఉచితం చాస్యాస్తత్రగమనమ్ | కిన్తు స్వస్థరూపయానయా భవితవ్యమ్ |

కిమాహ దేవసేనా – "నను భావదర్శనాత్ స్వస్థైవాహమ్" ఇతి | ప్రియం మే | కృతం మదనకర్మ | కర్ణీపుత్రప్రాణధారణార్థే కించిత్ స్మరణీయం దాతుమర్హసి | కిం బ్రవీషి – "కిం దాస్యామి" ఇతి | కిం నామ విచార్యతే | ఇదం ఖలు –

---

ప్రియవాదిని, ఏమంటివి? – " ఆర్యపుత్రుడిచటికి వచ్చుట యుచితము గాదు. అచ్చటికే యేగవలయును. వేశ్యలనగా కొండెతనములిత్యాదివి గలిగిన జాతి.

అందుకై, నేనే యథోచితముగా నిట్లు యోజింతును. నృత్తవారాదులను నిర్వహించుటకై స్వామిని స్వయముగా కుశలప్రశ్నను విచారించు నెపమున ఆర్యుడు మూల దేవుని కడకు పోవును."  బాగు ప్రియవాదినికా, సార్థకనామధేయమన నిదే కదా. అక్కడికి వచ్చుటయే యుచితము. అందువలన మీరు బాగుగ ఆరోగ్యమును పొందనగును.

ఏమంటివి దేవసేనా – "పండితుని దర్శనము వలన ఆరోగ్యవంతురాలనైనాను" అనియా. నాకు ప్రియమే. మదనకర్మ జరిగినది. కర్ణీపుత్రుని ప్రాణములను నిలుపుటకు స్మరణీయమైనది కొంచెమివ్వవలసినది. ఏమందువు? "ఏమిత్తుననియా?" ఆలోచించుటకేమున్నది, ఇదే కదా –

ఈషల్లీలాభిదష్టం స్తనతటమృదితం పత్రలేఖానువిద్ధం
ఖిన్నం నిశ్వాసవాతైర్మలయతరురసాక్లిష్టాకజల్కవర్ణమ్ |
ప్రాతర్నిర్మాల్యభూతం సురతసముదయప్రాభృతం ప్రేషయాస్మై
పద్మం పద్మావదాతే కరతలయుగళభ్రామణక్లిష్టనాళమ్ ||

---

పద్మావదాతే = రక్తపద్మము వలే శుభ్రమైన తరుణీ! (పద్మినీ జాతి దానా) ఈషత్ = కొంచెము, లీలాభిదష్టం = లీలగా కొరకబడినది, స్తనతటముదితం = పాలిండ్ల చివర బయల్వెడలినది, పత్రలేఖానువిద్ధం = పత్రలేఖ చిహ్నమును ధరించినది, మలయతరురసాక్లిష్టాక = చందనపు చెట్టు గాళుల ఆవరింపు గల, నిశ్వాసవాతైః = ఊపిరులచేత, అజల్కవర్ణం = మసివారినది, ప్రాతః = ఉషస్సున, నిర్మాల్యభూతం = తొలగించుటకు ఉంచబడినది, సురతసముదయప్రాభృతం = సురతము కలుగుటకునగు ఉపహారమైనది, కరతలయుగళభ్రామనాక్లిష్టనాళమ్
కరతలయుగళ = రెండు చేతులమధ్య
భ్రామన్ = భ్రమణము కలుగుట (త్రిప్పబడుట) వలన
ఆక్లిష్ట = లాగబడిన
నాళం = సూత్రము కలిగినది అయిన,
పద్మం = రక్తకమలమును, అస్మై = అతనికి, ప్రేషయ = పంపుము.

తాత్పర్యము: ఓ పద్మినీ! అలవోకగా నీ దంతములచేత కొరకబడినది, స్తనముల వద్ద నుండి బయల్వెడలినది, నీ చెక్కిలిపై గల పత్రలేఖాచిహ్నములను దాల్చినది, చందనపు చెట్టు గాలి వంటి నీ ఊపిరిచేత కొంత మ్లానమయినది, సుతారముగ నీ చేతుల మధ్య త్రిప్పబడుటవలన నాళము బయటకు వచ్చినది అయిన ఒక రక్తకమలమును అతనికి బహుమతిగ పంపుము.

*విశేషములు:*
*పద్మావదాతే = పద్మము వలే శుభ్రమైనది అనుట వలన పద్మిని జాతి స్త్రీ యను ధ్వని. పత్రలేఖానువిద్ధం = చెక్కిలిపైన అగరు/కస్తూరి వంటి సుగంధద్రవ్యములతో చక్కని ఆకృతులను చిత్రించుకొనుట ఒకప్పటి అలంకరణలలో భాగము. శ్యామలాదండకమున "..లావణ్య గండస్థల న్యస్త కస్తూరికా పత్రరేఖా సముద్భూత.." అని అంబ వర్ణనము.(శ్యామలాదండకకర్తగా కాళిదాసు ఆపాదింపబడెను). పత్రలేఖా అనువిద్ధం అనగా = చెక్కిలి క్రింద నలుగుటచే పద్మమున చెక్కిలిపై చిత్రించిన ఆకారము ముద్రింపబడినదైన (పద్మము) అని అర్థము.బహుమతి పంపుము అను విధేయార్థము ద్వారా శృంగారోద్దీపకమగు వస్తువును చమత్కరించుట రమణీయమైన ధ్వని. వాక్య వక్రోక్తి. ఈ భాణపు నామము పద్మప్రాభృతకము ఈ శ్లోకము వలననే ఏర్పడినది.*

*పద్మప్రాభృతకము అనగా పద్మమను ఉపహారము/బహుమతి. స్రగ్ధరావృత్తము (మ ర భ న య య య).*

కథం కాటాక్షాపాతేనైతదనుజ్ఞాతమనయా | హన్త ప్రతిగృహీతం ప్రాభృతం సురతసత్యంకారస్య | యావదనేనౌషధేన కర్ణీపుత్రం సంజీవయామి | (గృహీత్వోత్థాయ స్థిత్వా) ప్రస్థితోఽస్మి | సుఖం భవత్యై | సుభగే గృహీతామాశీః |

భయద్రుతమసూచితప్రచలమేఖలానూపురం
సశంకశిథిలోపగూహమవముక్తనీవీపథమ్ |
స్వయం సమభివాహయత్వయముదాత్తరాగాయుధః
తవ ప్రథమచోరికాసురతసాహసం మన్మథః ||

(ఇతి నిష్క్రాన్తో విటః)

ఇతి శ్రీశూద్రకవిరచితః పద్మప్రాభృతకం నామ భాణః సమాప్తః|

---

ఎట్టూ? కనులు దించుకుని ఆమోదము తెలిపినది. అహో సురతవిషయ బేహారమున మంచి ఫలము ముట్టినది. ఈ మందుతో కర్ణీపుత్రుని స్వాస్థునిగ జేసెదను.(స్వీకరించి, పైకి లేచి కాస్త ఆగి). ఇక ఉందును. నీకు సుఖమగుగాక. సుతను! ఇదిగో, ఆశీర్వాదము పుచ్చుకొనుము.

భయద్రుతం = భీతి గలదై, అసూచితప్రచలమేఖలానూపురం = బహిర్గతము కాని వడ్డాణపు చప్పుడు, అందెల రవళులు కలదానిని, సశంకశిథిలోఽపగూహం = శంకతో, గాఢము కాని కౌగిలి గలదానిని, అవముక్తనీవీపథం = వీడిన పోకముడి గలదానిని, స్వయం = తానే, ఉదాత్తరాగాయుధః = అనురాగమునే ఆయుధముగా కలిగినవాడు, మన్మథః = మదనుడు, తవ = నీయొక్క, ప్రథమచోరికా సురతసాహసం = మొదటి సారి చేయు రంకును, సమభివాహయతు = ప్రోత్సహించుగాక.

తాత్పర్యము: భయముచేత వడ్డాణపు, అందెల రవళులు బహిర్గతము చేయక, వెడలు దారి మధ్యనే తమకము చేత పోకముడి వీడి, శంకతో గాఢముగా కౌగిలింపక, ప్రథమ సురతక్రీడకై సాహసము చేయు నిన్ను మదనుడు ప్రోత్సహించుగాత!

*విశేషములు: ప్రకృతమైన భీతి, అప్రకృత రసమైన శృంగారమును చమత్కరించి, పోషించుచున్నది గావున రసధ్వని. అభిసారికానాయిక వర్ణనము. పృథ్వీవృత్తము. (జ స జ స య లఘువు, గురువు) అసూచితప్రచలమేఖలానూపురం = భయము చేత ఒక్కొక్క అడుగునూ వేస్తున్న కారణాన వడ్డాణము జారుతున్నదని, అందెల చప్పుడు వినిపించుట లేదని సూచన. పృథ్వీ వృత్తము – "జ స జ స య లఘువు, గురువు" అని గణములు.*

(అని విటుడు వెడలిపోవును)

## శూద్రకవిరచితమైన పద్మప్రాభృతకమను భాణము సమాప్తము.

# శ్లోక సూచి